THE ANDHRA PATRIKA, MADRAS.

# ఆంధ్రపత్రిక

Regd. No. M, 1118 సంపుటం 38. సంచిక 166

FOUNDER DESODHARAKA K. NAGESWARA RAO.

సోమవారం 17-9-1951 వెల 1 అణా, హాఫ్ 0-1-2.



# నెహ్రూ స్వయంగా గట్టి హామీ ఇస్తే స్వామీజీ ప్రాయోపవేశ విరమణ

## గత వాగ్దాన భంగాలవల్ల యజ్ఞశాల వర్గాల అవిశ్వాసం

### నిజ పరిస్థితులను గమనించే ఉగ్రతపస్సుకు ఉపక్రమించినట్లు ప్రధానికి సీతారాం సమాధానం

### దీక్షా విరమణకై రామలింగారెడ్డిగారికి ఆదేశం

[ఆంధ్రపత్రిక ప్రత్యేక విలేఖరి]

విజయవాడ, సెప్టెంబరు 16: స్వామీ సీతారాం ఇప్పట్లో ప్రాయోపవేశదీక్ష విరమించే సూచన లేదు. నెహ్రూగారి వైఖరిలో క్రొత్త మార్పు ఏమీ లేకపోవడమే యిందుకు కారణమని తెలుస్తున్నది. ఆంధ్రరాష్ట్రం త్వరలో ఏర్పడ వచ్చునని నెహ్రూ చేసిన ప్రకటన ఏమంత పెద్ద హామీగా ఎంచటానికి వీలులేనట్లు స్వామీజీ సన్నిహితులు భావిస్తున్నారు. ఈ క్లిష్టపరిస్థితులలో ఆంధ్రరాష్ట్ర విభజనకు ప్రత్యక్షంగా ప్రభుత్వం ఉపక్రమిస్తేనో, లేక, ప్రధాని నెహ్రూ స్వయంగా గట్టి హామీ ఇస్తేనోగాని స్వామీజీ ఈ కఠోర తపస్సును విరమించేటట్లు లేదని తెలుస్తున్నది.

ఆనాడు ఆంధ్రులు జె. వి. పి. నివేదికను ఆమోదిస్తే చాలు; నూతన రాజ్యాంగం అమలులోకి రాకపూర్వమే, ఆంధ్రరాష్ట్రం ఇస్తామన్నారు.

ఆంధ్రులు అంగీకరించారు. రాష్ట్రాల జాబితాలో ఆంధ్రరాష్ట్రం పేరు లేకుండానే భారతరాజ్యాంగం అమలులోకి వచ్చింది. విభజన సంఘ నివేదికపై ఒక్కరు వ్యతిరేక అభిప్రాయం వెలిబుచ్చగానే, అసలు సమస్యనే నెహ్రూగారు మూలకు నెట్టివేశారు. స్వామీ సీతారాం ప్రాయోపవేశానికి పూనుకొనే టంతవరకూ నెహ్రూగారు కానీ, ఇతర నాయకులుగానీ ఆంధ్రరాష్ట్ర విభజన సమస్యా పరిష్కారానికి పూనుకోనే లేదు. లోగడ ఏ అభిప్రాయభేదాన్ని పురస్కరించుకొని నెహ్రూగారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణసమస్యను అవతలకు నెట్టివేశారో ఇప్పుడుకూడా ఆదే అంశాన్ని ఆధారంగా చేసుకొని మళ్ళీ ఆయన రాష్ట్రవిభజన సమస్యను మూలకు నెట్టివేస్తారేమో కాని, ఆ సమస్యా పరిష్కారానికి పూనుకోరని స్వామీజీ సన్నిహితులు అభిప్రాయపడుతున్నారు. పూర్వ అనుభవాల కారణంగా ప్రభుత్వ ప్రకటనలో విశ్వాసం కుదరటంలేదని, ఆకారణంగా ప్రాయోపవేశం యింకా కొనసాగే సూచనలే ఎక్కువగా వున్నాయనీ తెలుస్తున్నది.

ఆంధ్రరాష్ట్ర విభజనకు అవసర చర్యలు ఆరంభించటంవల్లకానీ, లేదా నెహ్రూగారే స్వయంగా గట్టి హామీ ఇవ్వటంవల్లకానీ స్వామీజీ దీక్షావిరమణం చేయవచ్చుకానీ, అన్యవిధాల అట్టిది జరుగబోదనిపిస్తున్నది.

### రామలింగా రెడ్డిగారికి దీక్షా విరమణకు స్వామీజీ అనుజ్ఞ

చాగలమర్రిలో వున్న ఆర్. కె. రామలింగారెడ్డిగారికి ప్రాయోపవేశ దీక్ష విరమణకు తాము అనుమతించినట్లు నిన్న సాయంకాలం ప్రార్థనానంతర సభలో స్వామీజీ ప్రకటించారు.

ఈ ఆంధ్రమహాయజ్ఞశాలను ఎవరికి వారు తమ తమ రాజకీయాభిప్రాయాలను ప్రకటించేందుకు అనుకూల రంగంగా వుపయోగించరాదని స్వామీజీ నిన్న సాయంకాలం మళ్ళీ మనవి చేశారు. ప్రార్థనానంతరసభలో జరిగే ఈ వేదికను పూర్తిగా ఆంధ్రరాష్ట్ర వుద్యమానికి మాత్రమే వుపయోగించాలని ఉద్ఘాటించారు.

స్వామీ సీతారాంగారి వుద్యమంలో తమపార్టీ సహకరించగలదని ఆంధ్ర ఫార్వర్డుబ్లాక్ కార్యదర్శి విజయకుమార్ గారు వాగ్దానం చేశారు. ఈ మహాయజ్ఞం సందర్భంలో వివిధ పట్టణ వాసులు ప్రదర్శించిన ఉత్సాహాతిరేకాలను ప్రశంసిస్తూ బులుసు సాంబమూర్తిగారు ప్రసంగించారు.

### ఉద్యమ పరిణామం: స్వామీజీ హెచ్చరిక

(ఆంధ్రపత్రిక విలేఖరి)

గుంటూరు, సెప్టెంబరు 16: "వాస్తవ స్థితిగతులను ఆధారంగా చేసుకొని ఆరభించిన ప్రాయోపవేశమే నాది. నా దీక్షకు కారణభూతములైన ఆ పరిస్థితుల విషయంలోనే ప్రభుత్వమైనా చర్య తీసుకోవలసింది. ఆంధ్రరాష్ట్ర వుద్యమం అనతికాలంలో ప్రజల చేతులలో పడి ఏవి పరిణామాలుపొందినా, అందుకు బాధ్యతి మాత్రం నాదికాదు, ఆంధ్ర ప్రజానీకంలో యీనాడు ఏర్పడ్డ సంచలనం ఏ విధంగానైనా పరిణమించ వచ్చును. నేడు ఆంధ్రులలో బయలుదేరిన యీ నూతన చైతన్యాన్ని ముఖ్యంగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికై వినియోగించదలిచాను." అని స్వామీ సీతారాం, యీ 14 న నెహ్రూగారు పార్లమెంటులో అన్నదానికి సమాధానంగా చెప్పారు. ఆయన యింకా యిలా అన్నారు.

ప్రాయోపవేశ దీక్షను పూనినవారి శీలాలనుగూర్చి, లక్ష్యాలను గూర్చి వినోబా భావేగారు వెలిబుచ్చిన అభిప్రాయాలను గమనించవలసిందిగా కూడా నెహ్రూగారినికోరుతున్నాను.

"త్వరితగతిని రాష్ట్రవిభజన కొనసాగించేందుకు మేము కొన్ని హేతుబద్ధమయిన సులభమార్గాలను ప్రభుత్వానికి సూచించివున్నాము. భారతదేశ స్వాతంత్ర్యసమరం సాగుతున్న రోజులలో ఆంధ్రులు తమ స్వరాష్ట్ర నిర్మాణ సమస్యను నిర్లక్ష్యంచేసి కూడా, అనేక త్యాగాలు చేశారనే విషయాన్ని నెహ్రూగారి స్మరణకు తేవలసి వున్నది.

వివిధ రాష్ట్రాలలోనూ వుండిపోయిన నాలుగుకోట్ల ఆంధ్రులకు, తమ మాతృభాషలో పరిపాలన సాగించుకొనే భాగ్యంపట్టలేదు. ఆంధ్రప్రాంతం కొన్ని యూరోపియన్ దేశాలకంటె పెద్దదైయయినప్పటికీ, ఆంధ్రులు తమ మాతృభాషను ఇతరభాషలకు లోబరచి వుంచవలసి వస్తున్నది. ఆంధ్రులు అడుగుతున్నది స్వాతంత్ర్యం కాదు; స్వపరిపాలన మాత్రమే. మరుగుపరచటానికి వీలులేని వాస్తవపరిస్థితుల ప్రేరణవల్ల నేను తపస్సుకు ఉపక్రమించాను."

### గుంటూరు కౌన్సిలర్ల వుపవాస దీక్ష

గుంటూరు, సెప్టెంబరు 16: నేడు పురపాలకసంఘ సభ్యులందరూ వుపవాసం చేస్తున్నారు. ఈ తాలూకాలోని జనప, ప్రత్తి, పొగాకు తదితర మిల్లులలో పనిచేయు కూలీలందరు నిన్న సమావేశమై స్వామీజీ వుద్యమానికి సానుభూతి సూచకంగా వుపవాసం చేయ నిశ్చయించుకొన్నారు. గుంటూరు తాలూకాకిసాను సంఘ అధ్యక్షులు [illegible] గారికి రాజీనామా ఇచ్చారు. [illegible] నిన్న [illegible] అధ్యక్షులు సమావేశమై, తమ [illegible] ఒకరోజు వుపవాసం చేయాలని తీర్మానించుకొన్నారు.

### ఎస్. వి. రామకృష్ణరాజు గారి లేఖ

మద్రాసు నగరం విషయంలో

(2-వ పేజీ చూడుడు)

### రేషనులో సగం ఉప్పుడు బియ్యం

### సివిల్ సప్లయిల శాఖ ఉత్తర్వు

మదరాసు సెప్టెంబరు 16: మదరాసునగరంలో పచ్చిబియ్యం నిలవ చాలా తక్కువగా వున్నందువల్ల పచ్చిబియ్యం వారేవారికి సెప్టెంబరు 16 నుండి సగభాగం ఉప్పుడుబియ్యం మిగతా సగం పచ్చిబియ్యం ఇవ్వవలసిందని సివిల్ సప్లయిస్ శాఖవారు ఉత్తర్వుచేశారు.

సెప్టెంబరు 14 నాటికి నగరంలో 3628 టన్నుల ఉప్పుడుబియ్యం, 420 టన్నులపచ్చిబియ్యం వున్నవి. కార్డుదారులకు సప్లయి చేయవలసిన ఇప్పటి లెక్కప్రకారం పైన మొత్తం పచ్చిబియ్యం ఒక వారానికి మాత్రమే సరిపోతవి. పచ్చిబియ్యం ఉప్పుడుబియ్యం రెండుకలిసి 15 రోజులపాటు వస్తవి.

సెప్టెంబరు 12 వ తేదీన ఒక ఓడలో 9850 టన్నుల మైలో చెన్నపట్నంరేవు వచ్చింది, అందులో 4042 టన్నులు మదరాసులో దింపబడింది. తక్కినది సరుకు కలకత్తాకు పోతుంది.

## గ్రీసుస్వాతంత్ర్యానికి ఇంకా ముప్పు

### సమితి బాల్కన్ రాజ్యాలసంఘం నివేదిక

సమితి కేంద్ర కార్యాలయం, సెప్టెంబరు 15: లోగడ గ్రీసు స్వాతంత్ర్యానికి ఏర్పడిన అపాయం ఇంకా తొలగలేదని సమితి బాల్కన్ రాజ్యాలసంఘం ఈ రోజున ప్రకటించినది. సమితికి సమర్పించిన నివేదికలో ఆ సంఘం ఇంకా ఇలా తెలియపరిచినది:-

ఒక ఏడాదిగా కొన్ని పొరుగు మిత్ర యూరోపు రాజ్యాలు గ్రీసుపట్ల అవలంబించిన ప్రతికూల వైఖరి కారణంగా ఆ ప్రాంతంలో తీవ్రత అధికమైనది. బాల్కన్ ప్రాంతంలో శాంతి నెలకొనాలన్నా గ్రీసు స్వాతంత్ర్యానికి భంగం కలుగకుండా చూడాలన్నా కట్టుదిట్టం చేయవలసి వున్నది.

"అందుకుగాను ఉత్తర బాల్కన్ రాజ్యాలకు తత్సంబంధమైన ఇతర ఈ క్రింది సూచనలు చేశాము:-(1) గ్రీసు గెరిల్లా ఉద్యమానికి ఎట్టి సహాయం చేయకుండా ఉండవలెను (2) రాజకీయ సంబంధాలను, దౌత్య సంబంధాలను పునరుద్ధరించుకోవలెను (3) సరిహద్దు ఒడంబడికలను పునరుద్ధరించవలెను (4) గ్రీసు నౌకా వర్గాలను విచ్ఛిన్నం చేయవలెను (5) ఆ శ్రేణి యందు, ఒప్పందపత్రాలను యుద్ధపరికరాల సరఫరా విరమించవలెను (6) గ్రీసు సైన్యోద్యోగులను, గ్రీసు పిల్లలను, ఇతర గ్రీసుప్రజలను గ్రీసుకు తిరిగి పంపవలెను (7) ఆయా రాజ్యాల తగాదాలు పరిష్కరించు పరిశీలనకు సమితికి చెందిన సంస్థలతో సహకరించవలెను."

### లక్నోకు నెహ్రూరాక

లక్నో, సెప్టెంబరు 16: ప్రధాని పండిత నెహ్రూగారు నేటి ఉదయము విమానంలో నూతన కాంగ్రెసు కార్యదర్శి మల్లయ్య, పార్లమెంటరీ కార్యదర్శి శ్రీ సతీష్ చంద్రగారలతో సహా ఇక్కడికి విచ్చేశారు. ఉత్తరప్రదేశ్ గవర్నరు హోమీమోడీ ముఖ్యమంత్రి పండిత పంత్, శ్రీ పురుషోత్తమదాస్ టాండన్, నూతన కాంగ్రెసు కార్యదర్శి లాల్ బహదూర్ శాస్త్రి, ఉత్తర ప్రదేశ్ కాంగ్రెసు సంఘాధ్యక్షుడు ఆచార్య జుగల్ కిశోర్, మంత్రులు, కాంగ్రెసు నాయకులు, ప్రభుత్వోద్యోగులు పౌర ప్రముఖులు విమానాశ్రయంలో పండిత నెహ్రూగారికి స్వాగతం చెప్పారు.



## పర్షియా ప్రధాని మొసాదిక్ కు అవిరెల్ హారిమన్ లేఖ

### నూనెతగాదా పరిష్కారానికి కొత్త ప్రయత్నం

వాషింగ్టన్, సెప్టెంబరు 15: బ్రిటన్, పర్షియాలమధ్య ఏర్పడిన నూనెతగాదా పరిష్కరించే ప్రయత్నంలో అమెరికా అధ్యక్షుని ప్రతినిధి ఎవరెల్ హారిమన్ ఈ రోజున వ్యక్తిగతంగా పర్షియా ప్రధాని డాక్టర్ మొసాదిక్ కు ఒక లేఖను పంపారు. ఆయన లేఖలోని విషయాలను ప్రకటించడం జరుగలేదు.

పదిహేను రోజులలోగా తిరిగి రాయబారాలు ప్రారంభించకపోతే పర్షియాలో ఇంకా మిగిలివున్న బ్రిటిష్ పనివారిని దేశంనుండి బహిష్కరించడం జరుగుతుందని హెచ్చరిస్తూ మొసాదిక్ పంపిన లేఖను హారిమన్ ఇంకా బ్రిటన్ కు అందచేయలేదట.

ఇది బ్రిటన్ ను బెదరించడంకాదనీ, రాయబారాలు పునః ప్రారంభించే ఉద్దేశ్యంతో చేసిన ప్రతిపాదన మాత్రమే అనీ డాక్టర్ మొసాదిక్ అభిప్రాయమైనట్లు తెలుస్తున్నది. ఒక కోటి పౌన్లకు మించకుండా బ్రిటన్ కు నష్టపరిహారం చెల్లించడానికి కూడా అంగీకరిస్తున్నట్లు మొసాదిక్ తన లేఖలో తెలియపరిచారు. పర్షియా తరఫున బ్రిటన్ డాలర్ ప్రాంతంలో నూనె విక్రయించడం తమకు ఇష్టం లేదనీ, బ్రిటన్ అవసరాలకు సరిపోయేటంత నూనె మాత్రమే బ్రిటన్ కు విక్రయించ బడుతుందని ఆయన తన లేఖలో స్పష్టపరిచారు.

### స్టర్లింగు మారకంపై ఆంక్షరద్దు

టెహరాన్, సెప్టెంబరు 15: ఆంగ్లో - ఇరానియన్ నూనెసంస్థ స్టర్లింగును రియాల్స్ లోనికి మార్చుకొనకూడదంటూ విధించిన ఆంక్షను పర్షియా ప్రభుత్వం ఈ రోజున రద్దుచేసినట్లు ఇక్కడి బ్యాంకులవల్ల తెలుస్తున్నది.

కరెన్సీ మారకం విషయంలో పర్షియాకు ఉన్న ప్రత్యేక సౌకర్యాలను బ్రిటన్ ఇటీవల రద్దు చేసినది. దానికి సమాధానంగా పర్షియా ప్రభుత్వం ఈ ఆంక్షను విధించినది. కాని, దానివల్ల ఆంగ్లో-ఇరానియన్ నూనె సంస్థ పర్షియన్ పనివారికి జీతనాలు ఇవ్వడానికి వీలువుండదు. అందువల్ల దానిని తిరిగి రద్దుచేయడం జరిగినది.

### ఆఫ్ఘనిస్తాన్ తో నూనె ఒడంబడిక

ఆఫ్ఘనిస్తానుకు నూనె విక్రయించడానికి అంగీకరిస్తూ పర్షియా ఆఫ్ఘనిస్తాన్ తో ఒడంబడిక జరుపుకున్నట్లు టెహరాన్ రేడియో నేటిరాత్రి ప్రకటించినది. నూనె పరిశ్రమను జాతీయం చేస్తూ చట్టం చేసిన తరువాత పర్షియా జరుపుకున్న మొదటి నూనె విక్రయ ఒడంబడిక ఇది. ఈ ఒడంబడిక రీత్యా పర్షియా ఆఫ్ఘనిస్తానుకు 30,000 టన్నుల కిరోసిన్ తోసహా నూనె పదార్థాలను 87,000 టన్నుల [illegible] లను విక్రయిస్తుంది. పర్షియా సరిహద్దులోని [illegible] నుండి నూనె సరఫరా చేయడం జరుగుతుంది. ఆఫ్ఘనిస్తాన్ పర్షియాకు 35 లక్షల డాలర్లు చెల్లిస్తుంది.

ఉత్తర పర్షియాలో గిలాన్ రాష్ట్రంలోని రుడ్ సార్ గ్రామం వరదలలో మునిగిపోయినది. దాదాపు 100 మంది ప్రజలు వరదలలో మునిగి తమ ప్రాణాలు కోల్పోయారు. దాదాపు 1000 ఇండ్లు కొట్టుకొని పోయినవి.

## ప్రజాపార్టీ భవిష్యత్తు

### కార్యవర్గ నిర్ణయం

మదరాసు, సెప్టెంబరు 16: కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ కార్యవర్గం నిన్న మధ్యాహ్నం నుంగంబాక్కం హాడోస్ రోడ్ లో శ్రీ రఘునందన్ శరణ్ ఇంట్లో సమావేశమై కాంగ్రెసులో చేరకుండుటకు తీర్మానించారు. "అయితే శాసన సభల్లో ప్రవేశించి ప్రజల సహకారంతో ప్రభుత్వాన్ని హస్తగతం చేసుకొనుటకు వీలుగా పార్టీని సంఘటితపర్చాలని" నిశ్చయించారు.

సమావేశానికి రఫీ అహమ్మద్ కిద్వాయి, కె. కేలప్పన్, శ్రీ తెన్నేటి విశ్వనాథం, డా॥ పి. సి. ఘోష్ హాజరయ్యారు. అస్వస్థులై వున్నందున ప్రకాశంగారు మీటింగులో పాల్గొనలేదు.

ఐక్యత కావాలని పండిట్ నెహ్రూ చేసిన విజ్ఞప్తికి అభినందిస్తూ పరిస్థితుల్లో మార్పు ఏమీ రాలేదనియు, కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ నిర్మాణమునకు దారితీసిన కారణాలు అల్లాగే వున్నాయని కార్యవర్గం అభిప్రాయపడింది. "గాంధీగారి సాంఘిక సిద్ధాంతాల ననుసరించి కాంగ్రెసుపార్టీ ప్రణాళికలను తీర్మానములను కాంగ్రెసు ప్రభుత్వాలు అమలు జరుపుటలో విఫలమయ్యాయని తత్ఫలితంగా ఆర్థిక పరిపాలనా వ్యవస్థ ఛిన్నాభిన్నమై దేశం అధోగతిపాలు కానున్నందున శాంతియుత మార్గాలలో ప్రభుత్వాన్ని మార్చుట ఒక్కటే మార్గమనియు, అది శాసనసభల్లోనూ, దేశంలోనూ బలమైన ప్రతిపక్షం వున్నప్పుడే సాధ్యమని" కిసాన్ మజ్దూర్ పార్టీ కార్యవర్గంవారు తీర్మానంలో అభిప్రాయపడ్డారు.

రాష్ట్రమునకు రాష్ట్రమునకు భూమి సమస్యలు మారుతూ వుండును గాన స్థానిక పరిస్థితుల దృష్ట్యా సంస్కరణ చేయుటకు స్థానిక పార్టీలకు స్వేచ్ఛ వుండాలని కూడా కవున్సిల్ వారు మరొక తీర్మానం ఆమోదించారు. కవున్సిల్ మరల నేడు ఉదయం 9-0 లకు ఉడ్ లాండ్స్ లో సమావేశమవుతుంది.

టెహరాన్, సెప్టెంబరు 16: పర్షియా దిగువ శాసనసభలోని ప్రతికూల పక్ష సభ్యులు మళ్ళీ ఇవాళ కూడా శాసనసభా సమావేశానికి హాజరు కాలేదు. సభకు తగినంతమంది సభ్యులు రానందున సమావేశం నేటితో రద్దు చేయబడింది. మొజాదిన్ అను యాయులు తమపై దౌర్జన్యం చేయవచ్చుననే భయంతో ప్రతికూలపక్ష సభ్యులు ఇళ్లవద్ద కాపలాలు పెట్టుకొన్నారు.

## పత్రికలపై నిర్బంధాల బిల్లు: రాజాజీ సమర్థన

### ప్రజాభిప్రాయాన్ని అపమార్గానికి త్రిప్పకుండా శాసన మవసరమని పార్లమెంటులో ప్రసంగం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 15: హోంశాఖా మంత్రి ప్రతిపాదించిన పత్రికల బిలును సెలెక్టు కమిటీకి నివేదించడానికి పార్లమెంటు ఈ వేళ నిశ్చయించింది; సెప్టెంబరు 27 వ తేదీ లోపల సెలెక్టు కమిటీ పార్లమెంటుకు తన నివేదికను దాఖలు చేస్తుంది.

ఈ బిల్లుమీద వారం రోజులుగా జరుగుతున్న తీవ్ర వాదోపవాదాలకు హోంశాఖామంత్రి రాజగోపాలాచారిగారు యీ వేళ సమాధానం ఇస్తూ, ఎటువంటి నాగరకమైన స్వతంత్ర దేశాల్లోనూ కూడా, పత్రికలు స్వచ్ఛందంగానో, లేక నిర్బంధంగానో కొన్ని నీతినియమాలకు లోగి ఉండక తప్పదనీ, సంక్షోభాలూ, అశాంతి ఆందోళనలూ దేశంలో అనుక్షణం ప్రజ్వరిల్లకుండా ఉండేందుకు పత్రికలమీద విధించవలసినటువంటి కనీస నిర్బంధాలను మాత్రమే తామీ బిల్లులో విధించామనీ అన్నారు. "తక్కిన స్వతంత్ర దేశాలలో విధించబడుతున్న నిర్బంధాలకంటే ఎక్కువ నిర్బంధాలేమీ ఈ బిల్లు విధించటం లేదు.

ఒక ప్రజాస్వామిక ప్రభుత్వం వున్నదంటే, అది ప్రజాసామాన్యం యొక్క వత్తాసుమీద ఆమోదంమీద ఆధారపడి పని చేస్తుందిగాని బలప్రయోగంతో కాదు. కాబట్టి ఇటువంటి కృత్రిమ నిర్బంధాలేవీ విధించకుండా కేవలం ఆ ప్రజలయొక్క ఊతమే ఆధారంగా ప్రభుత్వం పనిచేసుకొని పోవాలని కొందరివాదం. ఈ వాదంపైకి చాలా రమ్యంగానే వుంది, కాని ఏ ప్రజాస్వామ్యంమీద ప్రభుత్వం ఆధారపడి వుందో, ఆ ప్రజా సామాన్యానికి పత్రికలు అనుదినం దేశద్రోహకరమైన లేదా దుష్టమైన భావాలన్నీ నూరిపోసి, వారి మనస్సులను విషదిగ్ధం చేస్తూవుంటే, ప్రభుత్వాన్ని చూస్తూ ఊరుకోమనడం భావ్యం కాదనుకొంటాను. పత్రికలు సామాన్య ప్రజలను అపమార్గంపట్టించే రాతలు రాయకుండా, దేశం శాంతియుతంగా పురోభివృద్ధి చెందేందుకు వీలుగా, కొన్ని అత్యవసరమైన విధి నిషేధాలను పొందుపరచడమే ఈ బిల్లు యొక్క ఉద్దేశ్యం. ఈ నాడు అమలులోవున్న పత్రికా శాసనాలు ఒక వీలూ చాలూ లేకుండా అవకతవకగా వున్నాయి. జనసామాన్యం యొక్క అభిప్రాయాలను ఆచరణను తీర్చి దిద్దడానికిగాని లేదా అపమార్గాన్ని పట్టించడానికిగాని వార్తాపత్రికలకు అమోఘమయిన శక్తి ఉన్నదనే విషయం ఎవ్వరూ కాదనలేరు.

కనుక పత్రికల నిర్వహణలో పాటించవలసిన మర్యాదలను నీతి నియమాలను పేర్కొన్నా అవి అందుకు లోబడి ఉండేటట్టుగా చూడటం ప్రభుత్వం యొక్క ధర్మం.

ఈ బిల్లుతో వాఙ్మూలంగా చేసే ప్రచారంకంటే వ్రాతమూలకంగా చేసే ప్రచారంమీద ఎక్కువ నిర్బంధాలు విధించినట్లవుతుందనీ, ఉపన్యాసాలకు రచనలకు, మధ్య ఈవిధంగా విచక్షణచూపడం అన్యాయం అనే వాదం ఎంతమాత్రం సబబుకాదు. ఏమంటే వ్యక్తిగతంగా చేసే ప్రచారానికీ పత్రికల ముఖతః జరిగే ప్రచారానికీ, పూర్వాపరమైన ఉన్నంత వ్యత్యాసంవుంది. ఒకదానికి సంబంధించిన శాసనాలు రెండవదానికి సరిపోవు.

పోతే, ఈ బిల్లు ఎంతో ప్రమాద పరిస్థితులు ఏర్పడినప్పుడు తప్ప మామూలు పరిస్థితుల్లో ప్రతిపాదించతగింది కాదనే విమర్శకు వద్దాం. వాస్తవానికి పరిస్థితులు ప్రస్తుతమేమీ ప్రమాదించకపోయినప్పటికీ స్థితిగతులు క్షణక్షణం మారిపోతూ వున్నకాలం ఇది.

మనదేశకాల పరిస్థితులను ఇతర దేశాలతో ఇతర కాలాలతో పోల్చడంలో అర్థంలేదు. మన ప్రత్యేకావసరాలను గమనించి తదనుగుణంగా శాసనాలను చేసుకోవడమే వివేకం అనిపించుకుంటుంది. అదీగాక శాసనాలు శిలాక్షరాలుకావు. పరిస్థితుల్నిబట్టి వాటిని మార్చుకుంటూ వుంటాం, లేకపోతే మాపు చేసుకుంటాం. ఇక ఈ శాసనాన్ని చూస్తే విదేశాలవారికి మనమీద దురభిప్రాయం కలుగుతుందనే వాదంలో కూడ ఏమీ పసలేదు. ఎందుచేతనంటే, ఇక్కడి పత్రికలు అనుభవిస్తున్న స్వాతంత్ర్యం ఏ నాగరికదేశంలోని పత్రికలు మును పెన్నడు ఇంత స్వాతంత్ర్యాన్ని అనుభవించి ఉండలేదనే విషయంకూడా నిర్వివాదం.

కేవలం సంక్షోభాలు లేపడమే ఉద్దేశ్యం అయినప్పుడుతప్ప, ప్రభుత్వాన్ని పరిపాలననూ ఎంత విమర్శించినప్పటికీ, ఆఖరికి ప్రభుత్వం చేసిన శాసనాలనూ రాజ్యాంగాన్నీ కూడా దుయ్యబట్టినప్పటికి పత్రికలమీద ఎట్టిచర్య తీసుకోబడదని ఇందుమూలంగా నేను హామీ ఇస్తున్నాను. సదుద్దేశ్యంతో చేసే ఎంతటి తీవ్రమైన విమర్శలకుకూడ ఈ బిల్లు వర్తించదని నేను నొక్కి చెప్ప గోరుతున్నాను.

3 వ క్లాజులోని 6 వ సబ్ క్లాజులోవున్న "తరగతులు" అనే మాట చూసి సభ్యులు అనేకమంది అనవసరంగా భయపడ్డారు. నిజానికి ఈ పదం 53 ఏళ్ళ క్రిందట చేసిన ఇండియన్ పీనల్ కోడ్ లో నే 153-ఎ సెక్షన్ లో వుంది. ఈ 53 ఏళ్ళుగా న్యాయ విచారణలో ఈ పదం ఎట్టి చిక్కులను దారితీయలేదు; దుష్టశిక్షణకు శిష్టరక్షణకు ఈపదం ఆటంకం కాలేదు; కాబట్టి దీనివల్ల ముందు ముందు చిక్కులు ఏర్పడినా రావచ్చునని భయపడేందుకు నాకేమీ ఆస్కారం కన్పించడంలేదు. ప్రజాస్వామ్యంలో ప్రజల హక్కులకు పరమమైన రక్షణ ఒకటి వుంది. నేరం ఆరోపించబడినప్పుడు దానిని గూర్చి బహిరంగంగా విచారణ జరిపించడం అన్నదే యీ

(2-వ పేజీ చూడుడు)

## ప్రాజెక్టుల నిర్వహణ: అమెరికా సాంకేతిక సహాయ ఒప్పందం

న్యూఢిల్లీ, సెప్టెంబరు 15: భారత ప్రభుత్వము, అమెరికా ప్రభుత్వము నేటి ఉదయం ఢిల్లీలో ఒక కొత్త సాంకేతిక సహాయ ఒడంబడికపై సంతకాలు చేసినవి. ఈ ఒడంబడిక ప్రకారం ఇండియాలోని నదీలోయ ప్రాజెక్టుల కార్యక్రమానికి కావలసిన సహాయాన్ని అమెరికా ఇంజనీరింగు నిపుణులను ఇండియాకు పంపుతుంది. క్రిందటి ఏడాది డిసెంబరు నెలలో ఈ ఉభయదేశాలమధ్య జరిగిన సాంకేతిక సహకార ఒడంబడికకు అనుబంధంగా నేటి ఒడంబడిక జరిగినది.

## ప్రకాశం పంతులుగారి ఆరోగ్యస్థితి

### రాచకురుపేనని వైద్యుల ప్రకటన

మదరాసు, సెప్టెంబరు 15: ఎస్. వి. కొండాపిగారు (ప్రకాశంపంతులుగారి ప్రైవేటు సెక్రటరి) ఇలా తెలుపుతున్నారు:

"ప్రకాశంగారికి రాచకురుపు వచ్చినట్లు వైద్యులు అభిప్రాయం ప్రకటించారు. వారి ఆరోగ్యస్థితి తృప్తికరంగా వున్నది. ఆందోళనపడడానికి కారణమేమీలేదని, అయితే ఆయన పూర్తిగా విశ్రాంతి మాత్రం తీసుకోవలసిన అవసరం వున్నదని డాక్టర్లు అభిప్రాయపడుతున్నారు. గనుక ప్రకాశంగారిని చూడాలని అభిలషించేవారు ఆ ప్రయత్నం మాని వారికి యే విధమైన శ్రమ ఇవ్వరాదని కోరుతున్నాము. ప్రకాశంగారి ఆరోగ్యస్థితిగూర్చి భోగట్టా ఎప్పటికప్పుడు ప్రజలకు తెలుపుతూ వుంటాము."

### వైద్యుల సలహా

మద్రాసు, సెప్టెంబరు 16: ప్రకాశంగారు శస్త్రచికిత్స జర్గిన మూడో రోజున ఇంకా బలహీనంగా నే ఉన్నారు. నేడు కొంత పుష్టినివ్వటానికి రక్తం ఎక్కించారు. నేడు శ్రీ జయప్రకాశ్ నారాయణగారు వారిని సాయంత్రం చూస్తారు. ప్రేక్షకులు ఎవ్వరూ వారిని చూచి బాధించరాదని డాక్టర్లు ఒక బోర్డువేశారు. పంతులు గారు వారంరోజుల్లో ఇరవై పౌనుల వరకు తగ్గిపోయారు. పంతులుగారికి బాగా విశ్రాంతి అవసరమని వైద్యుల అభిప్రాయం. కార్యదర్శులు కొమ్మారెడ్డి సూర్యనారాయణ, వై. ఆదినారాయణ రెడ్డిగారలు వారిని ఇవాళ చూచి రేపటి సభకు ఒక సందేశాన్ని తీసుకు వెడుతున్నారు. పంతులు గారు క్రమంగా కోలుకుంటారని వైద్యులు చెబుతున్నారు.

## అక్టోబరులో బ్రిటిష్ పార్లమెంటు ఎన్నికలు

లండను, సెప్టెంబరు 15: అక్టోబరు మాసాంతమందు గాని, నవంబరు మాసారంభమందుగాని బ్రిటిషు పార్లమెంటు ఎన్నికలను జరిపించుటకు బ్రిటిష్ ప్రధాని క్లెమెంటు అట్లీ సుముఖంగా ఉన్నాడని తెలుస్తోంది. ఎన్నికలకు సరియైన తేదీని తన మంత్రివర్గంతో కలిసి ఆలోచించి ప్రకటిస్తాడు.

### భారతీయ పరిశ్రమలలోని కార్మిక స్త్రీల పరిస్థితులు

ఝూరియా, సెప్టెంబరు 13: భారత ప్రభుత్వ కార్మికశాఖ భారతీయ పరిశ్రమలలో పనిచేస్తున్న స్త్రీల ఉద్యోగ పరిస్థితులను, ఆర్థిక సాంఘిక పరిస్థితులను పరిశీలించ దలుస్తున్నదని తెలుస్తున్నది.

# 'ప్రాయోపవేశం విరమించండి'

## స్వామి సీతారాంకు కొండా వెంకటరంగారెడ్డిగారి విజ్ఞప్తి

హైదరాబాదు, సెప్టెంబర్ 16:– "ఆంధ్రరాష్ట్ర సత్వరనిర్మాణానికి నెహ్రూగారు హామీ యిచ్చారు కొబట్టి తాము ప్రాయోపవేశ దీక్ష చాలించం" అని హైదరాబాదు ఆంధ్ర కాంగ్రెసు సంఘాధ్యక్షులైన కొండా వెంకటరంగారెడ్డిగారు స్వామి సీతారాంకు ఒక విజ్ఞప్తి చేశారు. "బాబాపు నెలరోజుల తమ ప్రాయోపవేశం ఆంధ్రరాష్ట్ర వాంఛను ముందుకు తెచ్చింది. నెహ్రూగారు హామీయిచ్చారు. కొబట్టి తామువెంటనే ప్రాయోపవేశం చాలించండి. మీ ప్రాణాలవిషయంగానూ, ఆంధ్రరాష్ట్ర విషయంగానూ తెలంగాణా సోదరులు చాలా ఆదుర్దా పడుతున్నారు." అని రెడ్డిగారు తమతంతిలో తెలియజేశారు.

### మహబూబాబాదు పౌరుల సానుభూతి

మహబూబాబాదు, సెప్టెంబరు 12: నేటి సాయంత్రం స్థానిక వైశ్యయువజన సంఘ గ్రంథాలయంలో సమావేశమైన పౌరులు స్వామి సీతారాంగారి ప్రాయోపవేశంపట్ల, తమ ఆందోళనను ప్రకటించి, ఆయనదీక్ష సఫలం కావాలని కోరారు. తర్వాత యీ క్రింది తీర్మానం ఏకగ్రీవంగా ఆమోదించి, స్వామి సీతారాంగారికిన్నీ, నెహ్రూగారికిన్నీ టెలిగ్రాంద్వారా పంపారు. "సత్వర ఆంధ్రరాష్ట్ర నిర్మాణసిద్ధికి స్వామి సీతారాంగారు, మరియు వారి సహచరబృందం సంకల్పించి నడుపుతూవున్న ప్రాయోపవేశానికి మా హృదయపూర్వకమైన సానుభూతులను అర్పిస్తూ విషమపరిస్థితులు ఏర్పడకముందే, నెహ్రూప్రభుత్వం, ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి పూనుకొని, స్వామివారి దీక్ష విరమణకు హామీ ఇవ్వవలెనని కోరుచున్నాము."

ఈ తాలూకా, నేరడ గ్రామ కాంగ్రెసు కర్తలు యమ్. మల్లేశం, కే. రాములు, కే. వెంకయ్య, జి. వెంకటాద్రిగార్లు, స్వామి సీతారాం ప్రభృతులు సాగిస్తూవున్న ప్రాయోపవేశ దీక్షకు సానుభూతిగా 18–వ తేదీన ఒకరోజు నిరాహారదీక్ష సాగించారు.

### మహమ్మద్ ఇస్మాయిల్ విజ్ఞప్తి

సామర్లకోట సెప్టెంబరు 16: మద్రాసు శాసనసభా సభ్యుడు ప్రతిపక్షనాయకుడు మహమ్మద్ ఇస్మాయిల్ భారతప్రధాని నెహ్రూకు తంతి విజ్ఞప్తి పంపుతూ, భాషారాష్ట్రాలను, ముఖ్యంగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి వెంటనే పూనుకోవాలని, లేకపోతే విపరీత పరిణామాలు సంభవించవచ్చునని తెలియజేశారు. "రాష్ట్రం విషయంలో ఆంధ్రులంతా ఒకటే. అంతా సత్వరరాష్ట్ర నిర్మాణాన్ని వాంఛిస్తున్నారు. ఇందుకోసం ఎలాంటి యిడుములు ననుభవించడానికైనా, ఎంత త్యాగానికైనా సంసిద్ధంగా ఉన్నారు. వారిలో వారికున్న విభేదాలు యీవిషయంలో ఎంతమాత్రమూ అడ్డురాజాలవు. రాష్ట్ర సంపాదనకై స్వామి సీతారాం, యింకా అనేకవందలమంది తమప్రాణాలను త్యజించడానికి పూనుకున్నారు. రోజురోజూ పరిస్థితి విషమిస్తున్నది. మీరు ఆంధ్రదేశానికొచ్చి పరిస్థితిని స్వయంగా చూచి స్వామి సీతారాం ప్రభృతులను ప్రాయోపవేశం విరమించ వలసిందిగా ప్రోత్సహించవచ్చు. తద్వారా వారి ప్రాణాలను కాపాడవచ్చు. కాబట్టి ఆంధ్రరాష్ట్రం విషయం సాకల్యంగా విచారించి, తక్షణమే నిర్ణయంగైకొనాలి. మీరుజోక్యంకల్పించుకోకున్నట్లయితే, అది చాలా విషాదకరం కాగలదు." అని ఇస్మాయిల్ ప్రధానమంత్రికి విజ్ఞప్తి చేశారు.

కాంగ్రెసు అధ్యక్ష పదవిని స్వీకరించినందుకు అభినందిస్తూ, అల్పసంఖ్యాకులు, ముఖ్యంగా ముస్లిములయొక్క హక్కులు; ప్రయోజనాలు మీచేతుల్లో సురక్షితంగా ఉండగలవని దృఢనమ్మకం కలిగిందని ఇస్మాయిల్ అన్నారు.

"మత దురభిమానులను మట్టుపెట్టాలి. అధికార వ్యామోహ పనులను నిర్మూలించాలి. అధికారుల బంధు ప్రియత్వాన్ని, అవకాశవాదాన్ని తుదముట్టించాలి. మీ నాయకత్వం క్రింద కోఆపరేటివ్ కామన్వెల్తును నెలకొల్పాలి. దీనిని సాధ్యమైనంత త్వరలో మీరు సాధించగలరని భారతజాతి ఆశిస్తున్నది" అని ఇస్మాయిల్ అన్నారు.

### స్వామీజీ ప్రాయోపవేశం ఆంధ్ర ప్రజాపార్టీ కార్యదర్శుల ప్రకటన

మద్రాసు, సెప్టెంబర్ 16: ఆంధ్ర ప్రజాపార్టీ కార్యదర్శులు కొమ్మారెడ్డి సూర్యనారాయణ, వై. ఆదినారాయణ రెడ్డిగారలు యీ ప్రకటనచేస్తున్నారు: "రానాను ఆంధ్రరాష్ట్ర నిర్మాణవిషయంలో శ్రీ స్వామి సీతారాం సాగించుచున్న నిరాహార దీక్ష ప్రతిరోజూ రోజుకూ ఆంధ్రప్రజానీకం వ్యక్తీకరిస్తున్నది. స్వామిజీ 31 లో నుంచి సాగించుచున్న దీక్ష ప్రదేశంలో చాలమంది ఆంధ్రులు విచారానుభూతి కలిగియున్నారు. ఈ విషయమై ఆలోచించుటకు రేపు 17-9-51 వ తేదీన సంటూరులో స్వామిజీ అభిప్రాయంపై ఆంధ్రనాయకులు సమావేశం కానున్నారు. ఆంధ్రరాష్ట్ర నిర్మాణవిషయంలో ప్రతిఆంధ్రునికీ వ్యతిరేకాభిప్రాయం లేనందుకు మార్గాన్వేషణలో మాత్రం అభిప్రాయభేదాలు కలిగి స్వామిజీ చేయుచున్న సత్సంకల్పములను తోంతినుండి రాజకీయదృష్టితో పరిగణించుట కనుకోజనీయం.

పండిత నెహ్రూ కూడ "రాష్ట్ర నిర్మాణానికి అభ్యంతరంలేదు. కాని దానికి సంబంధించిన అన్ని వర్గములయొక్కగ్రీవంగా ఒక తీర్మానానికి రావలె నంటూ యున్నారు." ఇది బ్రిటిషువారు కాంగ్రెసుకు 1920 నుంచి 48 వరకు చెప్పి వంటిసామును పోలియున్నది. కాని పండిట్‌జీ స్వామీజీకి యిచ్చినజబాబులు చూస్తే ఆంధ్రులయెడల వారి కంతె నిరసనభావం కలిగియున్నదో ఆంధ్రులంతా తెలుసుకొనగోరుచున్నాము.

అభిప్రాయభేదాలులేని విషయములను ప్రాతిపదికగా తీసుకొని రాష్ట్ర నిర్మాణావతరణ కలుగజేసి, మిగతా విషయములను ఏదైనన్యాయ విచారణ సంఘముద్వారా పరిష్కరింపజేయుట ప్రజాస్వామిక సిద్ధాంతములు తెలిసిన జవహర్‌లాల్ గార్కి మేము వేరుగా చెప్పనక్కరలేదు.

ఇప్పటికైనను పండిట్‌జీ ప్రతిష్ఠకు పట్టుదలపై నిలబడక తగాదా విషయములను పరిష్కరించుటకు పంచాయతీ సంఘమును నియమించి స్వామిజీ వారిశిష్యుల వుపవాసములను విరమింపజేసి ఆంధ్రప్రజానీకంలోని అలజడిని తగ్గించగోరుచున్నాము."

### కృపలానీ సూచన

మద్రాసు, సెప్టెంబరు 16: ఆచార్య జె. బి. కృపలానీగారు స్వామి సీతారాం ప్రాయోపవేశాన్ని గూర్చి ఇల్లా చెప్పారు:- "ఆంధ్రరాష్ట్ర నిర్మాణ వివాదంలో ఇతర విభజనసంఘంవారి నివేదికను ప్రచురించవలసిన సమయం ఆసన్నమైంది. ఇందుకు సంబంధించిన పక్షాలన్నీ టీమున్నా ఏకీభావం ఉన్నదని నమ్మబడుతోంది. కొద్దివిషయాలనుగూర్చిమాత్రం వివాదం ఉన్నది. వాటి పరిష్కారానికి, వివాదానికి సంబంధించనటువంటి, నిష్పాక్షిక న్యాయమూర్తి విచారణ సంఘాన్ని నియమించాలి. తగు పరిష్కారానికి ఇదొక్కటే ఉత్తమమార్గం. స్వామి సీతారాంను, వారి శిష్యులను ఇది తృప్తిపరుస్తుందనుకుంటాను."

### నాయకులసభ జయప్రదం కావాలని సర్ యస్. వి. రామమూర్తిగారి సందేశం

సర్ యస్. వి. రామమూర్తిగారు అఖిల ఆంధ్ర నాయకుల సమావేశం జయప్రదం కావాలని కోరుతూ, స్వామిజీకి సందేశం పంపారు. "రాష్ట్ర నిర్మాణం విషయమై మీ ప్రతిపాదనలు, మధ్యవర్తిత్వము చాలా పసందుగాను. ఆచరణ సాధ్యంగాను ఉన్నవి." అని రామమూర్తిగారు అన్నారు.

### బందరు విద్యార్థుల సానుభూతి నిరశనదీక్ష

బందరు, సెప్టెంబరు 15: స్వామి సీతారాంగారి ప్రాయోపవేశ దీక్షకు సానుభూతిగా బందరు జాతీయ కళాశాల విద్యార్థులూ, అధ్యాపకులూ కూడా ఇవాళ నిరశనవ్రతం పూనారు. వారందరూ ఒక సభచేసి వెంటనే ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ప్రకటించి స్వామీజీ దీక్షావిరమణకు తోడ్పడవలసిందిగా నెహ్రూగారిని అర్థిస్తూ ఒక తీర్మానంచేశారు. తీర్మాన విషయాన్ని నెహ్రూగారికి, రాజేన్‌బాబుగారికి, వెంటనే తంతిమూలంగా తెలిపించారు.

విజయవాడ ఖద్దరు రైతుల సంఘం తరఫున పెరుమాళ్ల వటుంబరావుగారు 100/- మంత్రిప్రగడ సాంబశివరావుగారు 100/- లు స్వామిజీకి పంపారు.

ఆంధ్ర మహోద్యమంలో పాల్గొంటూ ప్రాయోపవేశ దీక్ష సాగించుటకు అనుమతి యివ్వవలసిందిగా అనేకచోట్ల నుండి అనేకమంది స్వామి సీతారాంకు లేఖలు వ్రాస్తున్నారు.

పిఠాపురం రెవెన్యూ యిన్‌స్పెక్టరుగారు, యీ ఉద్యమంపట్ల సానుభూతి సూచకంగా తమ ఉద్యోగమునకు రాజీనామా యిచ్చి, తూర్పు గోదావరిజిల్లా కలెక్టరుగారిని కూడా తమ పదవికి రాజీనామా ఇవ్వవలసిందిగా కోరారు.

గుంటూరు పురపాలక సంఘ సభ్యులు శ్రీ దర్శి సభాపతిగారు తమ సభ్యత్వానికి రాజీనామా యిచ్చి, రాజీనామా నిచ్చిన ప్రార్థక సమావేశం స్వామివారికి అందజేశారు. 500 మంది సత్యాగ్రహులను, ఉద్యమానికి సమర్పించగలనని కూడా వారు వాగ్దానం చేశారు.

ఆంధ్రరాష్ట్ర నాయీ బ్రాహ్మణ సంఘమువారు, విజయనగర పట్టణ నాయీ బ్రాహ్మణ సంఘంవారు స్వామిజీపట్ల తమ సానుభూతి వెల్లడిస్తూ ఉత్తరం వ్రాశారు. ఉద్యమం రోజు రోజుకూ వ్యాపించి ఉద్యమంలో పాల్గొనుచున్నది. అనేకమంది, అనేక ప్రాంతాల నుంచి ఆంధ్రమహోద్యమంపట్ల సానుభూతి సభా తీర్మానాలను పంపుతున్నారు. సత్యాగ్రహంలో వ్యక్తిగా పాల్గొనటానికి సంసిద్ధంగా ఉన్నామని, స్వామిజీ పిలుపుకోసం వేచియున్నామని యీ ఉద్యమానికి నాయకత్వం వహించి నడపవలసిందని స్వామిజీని కోరుతారు. నిన్న మద్రాసు నుండి ఎం. ఎల్. శాస్త్రిగారు స్వామీజీతో సంప్రదించారు.

# కాంగ్రెస్‌వాదులకు నెహ్రూ హితవు

### యు. పి. లో హర్షం

లక్నో, సెప్టెంబరు 14: కాంగ్రెస్‌వాదులను గూర్చి, కాంగ్రెసునుండి వెళ్ళిపోయినవారిని గూర్చి నెహ్రూ నిన్న చేసిన ప్రకటనను యు. పి. కాంగ్రెసువాదులు, కె. ఎం. పి. వారు కూడా హర్షిస్తున్నారు.

ఈ ప్రకటనయొక్క ఫలితాలు ఈ విధంగా వుంటాయని చెప్పడం ఇప్పుడప్పుడే సాధ్యంకాక పోయినా, కొంతమంది కె. ఎం. పి. వారు కాంగ్రెస్‌లో చేరే సావకాశం లేకపోలేదని కె. ఎం. పి. వర్గాలవారు భావిస్తున్నారు.

యు. పి. రాజకీయవర్గాలవారు ఈ ప్రకటనకు ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తున్నారు. ఎందుచేతనంటే ఇది కె. ఎం. పి. పార్టీ కార్యవర్గం సమావేశం జరగడానికి ముందు, యు. పి. కాంగ్రెస్ కమిటీ సమావేశం జరిగే ముందు వచ్చింది.

కె. ఎం. పి. పార్టీనాయకుడు రఫీ అహ్మద్ కిద్వాయ్ మద్రాసుకు ఢిల్లీ మీదుగా బయలుదేరారు. లక్నోలో వున్న రెండురోజుల్లోను ఆయనస్థానిక కె. ఎం. పి. వర్గాలవారితో పరిస్థితులను అన్నింటినిగూర్చి చర్చించారు.

### కాంగ్రెస్‌నుండి విడిపోయిన వారిలో సుముఖత

న్యూఢిల్లీ, సెప్టెంబరు 14: కాంగ్రెస్‌నుండి వైదొలగినవారిని తిరిగి కాంగ్రెస్‌లోనికి ఆహ్వానిస్తూ పండిత నెహ్రూగారు చేసిన ప్రకటన కాంగ్రెస్‌నుండి వైదొలగిన వారికిగాని, ఇతర కాంగ్రెస్ వర్కర్లకుగాని ఆశ్చర్యము కలిగించలేదు. కాంగ్రెస్‌నుండి వెళ్లిపోయినవారిని తిరిగి కాంగ్రెసులోచేర్చి, కాంగ్రెస్ ఐక్యతను పునరుద్ధరింప పండిత నెహ్రూ త్రికరణశుద్ధిగా ప్రయత్నిస్తారని అందరు అనుకొనియే వుండిరి. నెహ్రూగారి విజ్ఞప్తిపై కాంగ్రెస్‌నుండి వైదొలగినవారు వెలిబుచ్చిన తొలి అభిప్రాయాలవల్ల వారు నెహ్రూ విజ్ఞప్తికి సుముఖంగా వున్నట్టు నిశ్చయంగా చెప్పవచ్చును. కాని వారి భవిష్యత్ కార్యక్రమము విషయమై నిశ్చితమైన సూచనలేమియు కనబడటం లేదు. రేపు వారు మద్రాసులో సభచేస్తున్నారు. ఆ సభ పూర్తియగువరకు వారి నిర్ణయము తెలియదు. నెహ్రూగారి ప్రకటన వారి అసంతృప్తి సంతతిని వెంటనే తొలగించజాలక పోయినప్పటికి ఆ విజ్ఞప్తిని మనస్సులో వుంచుకొనే వారు నిర్ణయాలు చేస్తారనుట నిశ్చయము.

కాంగ్రెసు ప్రజా సత్తాకంగా పని చేయకపోవడంవల్ల తాము కాంగ్రెసును వదలిపెట్టి వెళ్ళినమాట వాస్తవమే అయినప్పటికి తాము కాంగ్రెసు నుండి వెళ్ళిపోవుటకు యితర కారణాలుకూడ వున్నవని కాంగ్రెసునుండి వైదొలగినవారి నాయకులు చెప్పుతున్నారు. ఇంతేగాక కాంగ్రెసు వ్యవహారముల యెడలను ప్రభుత్వముల కార్యకలాపాల యెడలను అసంతృప్తి చెందియున్న జనానికి తాము ఆశలు కలిగించారని, కనుక అన్ని విషయాలను క్షుణ్ణంగా విచారించకుండా తమ నిర్ణయాన్ని మార్చుకొనవీలులేదని వారంటున్నారు. కాంగ్రెసు వ్యవహారాల్లో కేంద్రమునందు రాష్ట్రాలలో కూడ పండిత నెహ్రూగారు యెంత వరకు మార్పులు చేయగలుగుతారు అనే విషయముపై వారింకా సంశయగ్రస్తులుగా వున్నారు. తిరిగి కాంగ్రెసులో చేరడానికి నాయకులు అంగీకరించినప్పటికి పార్టీయందలి సామాన్య సభ్యులను తిరిగి కాంగ్రెసులో చేరమని ప్రోత్సాహపరచడం కష్టమని వారంటున్నారు. ఇట్టిమార్పులు నెహ్రూగారు చేయగలుగుతారనే ఆశలుగూడ లేకపోలేదు. కనుక వారు నెహ్రూగారి లక్నో ప్రయాణం విషయమై ఉత్సుకత చూపుచున్నారు. ఉత్తర ప్రదేశ్ కాంగ్రెస్ వ్యవహారాలను నెహ్రూగారు చక్కబరచ గలిగితేయెడల గొప్ప ఆటంకం తొలగిపోయిందని వారు తలుస్తున్నారు. కిద్వాయ్‌గారు లక్నో నుండి యిప్పుడే ఢిల్లీకి తిరిగివచ్చారు. నెహ్రూ కాంగ్రెస్ అధ్యక్షుడవడం వలన యేర్పడిన పరిస్థితిని తన సహచరులతో చర్చించడానికి కిద్వాయ్‌గారు ఇక్కడికి వచ్చారని తలపవచ్చును. ఇంతవరకు ఆయన పండిత నెహ్రూను కలిసికొనక పోయినప్పటికి మద్రాసు నుండి తిరిగి వచ్చినతరువాత ఆయన నెహ్రూగారిని కలిసికొంటారని అనుకొంటున్నారు.

### మంత్రుల పర్యటన

మదరాసు, సెప్టెంబరు 16: స్థానిక స్వపరిపాలనమంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళిగారు 23వ తేది రాత్రి కలకత్తా మెయిలులో బయల్దేరి 24 తెనాలి, 25 విజయవాడ, 26 తాడేపల్లిగూడెం, 27 కాకినాడ, 28 శ్రీకాకుళం, 29 విశాఖలలో కాంగ్రెసు ఎన్నిక కమిటీలతో కలిసి పర్యటన చేస్తారు. ఆ తరువాతి కార్యక్రమం అనంతరం ప్రకటింపబడుతుంది.

విద్యాశాఖామంత్రి శ్రీ వి. సి. శెట్టిగారు రేపు 17వ తేదీ మధ్యాహ్నం 2 గం. మెయిలులో కోయంబత్తూరు వెళ్ళి 18వ తేదీ సాయంత్రం 5 గంటలకు మదరాసుకు తిరిగివస్తారు.

# గుల్జారిలాల్ నందాకు కేంద్రమంత్రి పదవి

### ప్లానింగు వ్యవహారాలపై అధ్వర్యం: అధికార ప్రకటన

న్యూఢిల్లీ, సెప్టెంబరు 15: ప్లానింగ్ కమిషను ఉపాధ్యక్షులైన గుల్జారీలాల్ నందాగారిని కేంద్ర ప్రభుత్వ మంత్రిగా నియమించినట్లు నేటి అధికార ప్రకటన తెలుపుతున్నది. శ్రీ నందాగారు ప్లానింగుకు సంబంధించిన వ్యవహారాలను నిర్వహిస్తారు. నందాగారు ప్లానింగ్ కమిషను ఉపాధ్యక్షులుగాగూడ వుంటారు. కాని ఈ ఉపాధ్యక్ష పదవికి నేటినుండి జీతం వుండదు. నందాగారి వయస్సు 53. అహమ్మదాబాదు ప్రముఖ కార్మిక నాయకుడు. 1922 నుండి 1946 వరకు ఆయన అహమ్మదాబాదు మిల్లుపనివారిసంఘ కార్యదర్శిగా పనిచేశారు. బొంబాయిరాష్ట్రంలో మొదట యేర్పడిన కాంగ్రెస్ మంత్రివర్గంలో ఆయన 1937 నుండి 1939 వరకు కార్మికశాఖ పార్లమెంటరీ కార్యదర్శిగా వున్నారు. ప్రస్తుతం బొంబాయి ప్రభుత్వములో కార్మికశాఖమంత్రి. తరువాత గృహ నిర్మాణ శాఖనుగూడ నిర్వహించారు.

### బెంగాల్ మాజీ కాంగ్రెస్‌వాదుల వైఖరిలో మార్పు

కలకత్తా, సెప్టెంబరు 14: కాంగ్రెసుకు అధ్యక్షుడుగా నెహ్రూ ఎన్నుకొనబడటంవల్ల దానిలోంచి పోయిన కొంతమంది తిరిగివచ్చి కాంగ్రెసులో చేరే అవకాశం వున్నదని బెంగాలు రాజకీయ వర్గాలవారు భావిస్తున్నారు.

కే. ఎం. పి. పార్టీవారి భావం ఈ విషయమై అంతగా బయటపడక పోయినా, జుగాంతర్ వర్గంవారు మాత్రం తిరిగి కాంగ్రెసులో తాము చేరడానికి నెహ్రూ ఈ చర్య తోడుపడగలదని భావిస్తున్నారు.

# పాకిస్థాన్ ప్రచారం: ముస్లింల వలస

న్యూఢిల్లీ, సెప్టెంబరు 13: ఇండియానుంచి భోక్రాపూర్ మీదుగా పశ్చిమ పాకిస్థాన్‌కు ముస్లింలు మళ్ళీ వలస వస్తున్నారని ఆక్షేపిస్తూ, 1951 జూన్ 9 వ తేదీన న్యూఢిల్లీలోని పాకిస్థాన్ హైకమిషనర్ పంపిన లేఖకు భారత ప్రభుత్వం నిన్న ప్రత్యుత్తరం ఇచ్చింది. పాకిస్థాన్‌లో నిర్విరామంగా జీహాద్ ప్రచారం సాగుతూండడం, అర్థికంగా ఇండియా చితికిపోవడానికి ఇక అట్టే రోజులు పట్టదని పాకిస్థాన్ పత్రికలు ఎడతెరిపిలేకుండా వ్రాస్తూ ఉండడం, ఇండియాలోని ముస్లింలకు భయోద్వేగం కల్గించాయి. ఇందుకుతోడు, పాకిస్థాన్‌లో జరుగుతున్న యుద్ధ ప్రచారం చూచి, ఇండియా పాకిస్థానకు యిక యుద్ధం తప్పదని భయపడిపోయి, పాకిస్థాన్‌లోని ప్రజలు ఇండియాలోని తమ బంధువులకు పాకిస్థాన్ వచ్చెయ్యమని తొందర పెడుతూ ఉత్తరాలమీద ఉత్తరాలు వ్రాయటం మొదలు పెట్టారు. పశ్చిమ పాకిస్థాన్‌కు ముస్లింలవలస మళ్ళీ ప్రారంభం అయిందంటే అందుకు ఇవే ముఖ్య కారణాలు అని భారత ప్రభుత్వం తన ప్రత్యుత్తరంలో స్పష్టపరిచింది.

"భోక్రాపూర్ మీదుగా వలస వస్తున్న ముస్లింలను భారతీయ అధికారులు అవతలకు నెడుతున్నారనే ఆరోపణను గురించి భారత ప్రభుత్వం దర్యాప్తు జరిపించింది; ఈ విషయంలో మీరు చేసిన ఫిర్యాదు లేశమూడా ఎంత మాత్రం నిజంకాదని ఈ విచారణవల్ల స్పష్టం అయింది. ఇట్టి నిరాధారమైన ఆరోపణలు చేయడం మంచిదిగాదని భారత ప్రభుత్వం తీవ్రంగా హెచ్చరిక చేయగోరుతున్నది. అద్దూ అపూ లేకుండా ఇలాంటి అర్థం పర్థంలేని ఆరోపణలను మీరు చేయడంవల్ల పాకిస్తాన్ ఉద్యోగులు ఆ అదును తీసుకొని, ఇండియానుండి వలసవస్తున్న ముస్లిమేతరులను కూడా హింసలు పెట్టడం సాగిస్తున్నారు. ఇటీవల ఒకసారి సింధునుంచి భోక్రాపూర్ మీదుగా ఇండియాకు వస్తున్న ముస్లిమేతరులను కొందర్ని మీకస్టమ్సు ఉద్యోగులు ఇలా నానా తిప్పలుపెట్టి ఆ జట్టులో వున్న ఆడవారిమీద కూడా అత్యాచారాలు జరిపినట్లు కూడ మాకు తెలియవచ్చింది.

ఇండియానుంచి ముస్లిముల వలసను అరికట్టడానికి భారత్‌కూ పాకిస్థాన్‌కూ మధ్య ఏ విధమైన రవాణా సౌకర్యాలు లేకుండా చెయ్యాలని పాకిస్థాన్ ప్రభుత్వ ప్రతినిధి చేసిన ప్రతిపాదన ఎంతమాత్రం ఆచరణ యోగ్యం కాదు. ఇట్టి విషయాలలో బలప్రయోగం మంచిదికాదని భారత ప్రభుత్వం అభిప్రాయపడుతున్నది. ఇండియాలోని ముస్లిములకు ప్రాణమానభయం లేకుండా శాంతిభద్రతలు కల్పించడానికి భారతప్రభుత్వం నిరంతరంగా కృషిచేస్తున్నది. అయినప్పటికీ ముస్లింల కింకా భయాందోళనలు తగ్గలేదంటే, అందుకు కారణం పాకిస్థాన్‌లో జరుగుతున్న జీహాద్ ప్రచారమే తప్ప మరొకటి కావడానికి వీలులేదు." అని భారత ప్రభుత్వం స్పష్టపరిచింది.

### చల్లపల్లి రాజా దరఖాస్తు

మద్రాసు, సెప్టెంబరు 16: మద్రాసు శాసనసభకు చల్లపల్లి రాజాగారు కాంగ్రెసు అభ్యర్థిగా పోటీ చేయదలచి, ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు సంఘానికి దరఖాస్తు పెట్టారు.

# కాంగ్రెస్ కొత్త కార్యవర్గం

### ఢిల్లీవర్గాల వ్యాఖ్య

ఢిల్లీ, సెప్టెంబరు 15: వారికాంగ్రెసు కార్యవర్గమును సమూలంగా మార్పు చేయవలెనని ఇదివరలో నెహ్రూ చెప్పుతూవున్న విషయమే కనుక కొత్త కార్యవర్గంలోని పేర్ల జాబితాను చూచి ఆశ్చర్య పడవలసిన అగత్యంలేదు. నిన్న 15 మంది పేర్లు ప్రకటింపబడినవి. వీరిలో 8 మంది ఆదివరకెన్నడూ కాంగ్రెసువర్కింగు కమిటీలో ఉండలేదు. శంకరరావు దేవుగారు మాత్రము యిదివరకొకమారు కాంగ్రెసు కార్యదర్శిగా పనిచేసి వున్నారు. మొత్తముమీద ఈ కొత్త వర్కింగు కమిటీలో 9 మంది కొత్తవార్లు 6 మంది పాత వర్కింగుకమిటీలోని వార్లే. రాష్ట్రకాంగ్రెసు కమిటీల ప్రెసిడెంట్లు 5 గురు యీ కమిటీలో ఉన్నారు. (1) ఆంధ్ర (2) తమిళనాడు (3) తూర్పుపంజాబు (4) మహారాష్ట్ర (5) రాజస్థాను – ఈ 5 ప్రదేశ కాంగ్రెసు కమిటీల ప్రెసిడెంట్లు వున్నారు.

కొత్తకాంగ్రెస్ కార్యవర్గ కార్యదర్శు లిద్దరిలో ఒకరైన యు. శ్రీనివాస మల్లయ్యగారు దక్షిణ కన్నడం జిల్లాలో సుప్రసిద్ధ కాంగ్రెసు నాయకులుగా ఉంటున్నారు. ఇండియా పార్లమెంటులోని కాంగ్రెసు పార్టీ తాలూకు సీనియరు విప్పుగా ఉంటున్నారు. రెండవ కార్యదర్శియైన లాలుబహదూరు శాస్త్రిగారు ఉత్తర ప్రదేశ మంత్రివర్గంలో హోంశాఖా మంత్రిగా ఉన్నారు. వీరు ఆ మంత్రిపదవికి త్వరలోనే రాజీనామా యిస్తామని నేడు పత్రికా ప్రతినిధులతో అన్నారు. ఈ హోంశాఖాధికారమును ఉత్తర ప్రదేశ్ ముఖ్యమంత్రిగారే నిర్వహిస్తారు. వెనుకటి టాండను గారి వర్కింగు కమిటీలో 20 మంది సభ్యులుండిరి. ఈ కొత్త కార్యవర్గములో ఇంకా 5 గురు మెంబర్లు చేర్చుకోబడుదురు. వెనుకటి వర్కింగుకమిటీలో ఇద్దరు స్త్రీలు మెంబర్లుగా ఉండిరి. (1) మిస్ మణిబేన్ పటేలు. ఈమె అ. భా. కాం. కమిటీ కోశాధికారిగా ఉండేది. శ్రీమతి పుష్పాబేన్ మెహతా (సౌరాష్ట్ర) ఈ కొత్త వర్కింగుకమిటీలో ఒక స్త్రీ సభ్యురాలు నియమింపబడగలదు. కొత్త వర్కింగుకమిటీలో హరిజన నాయకుడును మాజీ మద్రాసుప్రభుత్వ మంత్రియును అయిన మునిస్వామిపిళ్ళై గారు నియమింపబడినందువల్ల హరిజనుడును కేంద్ర ప్రభుత్వమునందు కార్మికశాఖామంత్రియునైన జగ్జీవనరాంగారు కూడా యీ క్రొత్త వర్కింగుకమిటీలో చేర్చుకోబడుట జరుగదు.

సి. రాజగోపాలాచారిగారు పత్రికా ముద్రణా చట్టమును గూర్చిన వ్యవహారమును ఇండియా పార్లమెంటు ముగించిన పిమ్మట కేంద్ర ప్రభుత్వ హోంశాఖామంత్రి పదవినుండి విరమిస్తారు. ఆయన వర్కింగుకమిటీలో ఉండవలెననిగాని, కాంగ్రెసు పార్లమెంటరీ బోర్డులో ఉండవలెననిగాని కోరడంలేదు.

# కిద్వాయ్ వ్యాఖ్య

న్యూఢిల్లీ, సెప్టెంబరు 16: కాంగ్రెసు కార్యవర్గాన్ని పునర్నిర్మించే విషయంలో పండిట్ నెహ్రూ చూపిన పట్టుదల ప్రశంసనీయంగా వుందనీ, ఆయా రాష్ట్ర కాంగ్రెసు సంఘాలలో గూడా తమ పార్టీ సభ్యులకు తగినంత క్రియాస్వాతంత్ర్యం లభించేటట్టు ఆయన చేయగలిగినట్లయితే, ఆయనను బలపరచడానికి తాము సిద్ధంగావున్నామనీ, కృషక్ ప్రజా మజ్దూర్ పార్టీ నాయకుడు రఫీ అహ్మద్ కిద్వాయ్‌గారు ఈ వేళ యిక్కడ ప్రకటించారు. కిద్వాయ్‌గారు కృషక్ ప్రజా మజ్దూర్ పార్టీ కార్యవర్గ సమావేశానికి మొన్న మద్రాసువెళ్లి అక్కడనుంచి ఇవాళే ఢిల్లీకి తిరిగివచ్చారు.

"కె. ఎమ్. పి. పార్టీలో చేరిన వారిలో అనేకమంది ప్రధానమంత్రి అభిప్రాయాలతో ఏకీభవిస్తున్నారు. ప్రధానమంత్రికి చేయూత ఇవ్వాలని వారు తాపత్రయ పడుతున్నారు. కానీ రాష్ట్ర కాంగ్రెసు సంఘాలు వెనకటివే గనుక, తమకా సంఘాలలో తగినంత స్వేచ్ఛ క్రియాస్వాతంత్ర్యం లభిస్తుందా అని వారు అనుమానిస్తున్నారు. రేపు కాంగ్రెసు అధ్యక్షుడు లక్నో వచ్చినప్పుడు ఏంజరుగుతుందో అని కె. ఎమ్. పి. పార్టీవారు ఆతురతతో ఎదురుచూస్తున్నారు. కాంగ్రెసు నుంచి చీలిపోయినవారికి తాను చేసిన విజ్ఞప్తిలో పండిట్ నెహ్రూ ఏ యే విషయాలైతే చెప్పివున్నారో వాటి నన్నిటినీ ఆయన అమలుజరిపించ గల్గినట్లయితేను, యు. పి. కాంగ్రెసు కమిటీ ఆయన కోరినవిధంగా మసులుకొన్నట్లయితేను, కె. ఎమ్. పి. పార్టీ సభ్యులలో చాలా 'సుముఖ భావం' ఏర్పడగలదు. అల్లా జరిగినపక్షంలో భవిష్యత్తు చాలా ఆశావహంగా ఉంటుంది." అని ఆయన అన్నారు.

### కాంగ్రెసులో పునఃప్రవేశాలు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 16: సిద్ధేశ్వర్‌సు ఎమ్. ఎల్. ఏ., మాజీ ఏ. ఐ. సి. సి. సభ్యుడు దుర్గాచరణ్ పటేలు, తాను, మధ్యప్రదేశ్‌లోని రాజకీయ బాధితుల తాలూకు మరో 17 మంది సభ్యులూ కాంగ్రెసులో తిరిగి చేరడానికి నిశ్చయించుకున్నామని, సురేంద్రనాథ్ త్రిపాఠీగారు ఈ వేళ ప్రకటించారు.

# పులిచింతల, కృష్ణా పెన్నారు ప్రాజెక్టులు

### సమగ్ర పరిశీలనకు సంఘం: ఆంధ్ర కాంగ్రెస్ నియామకం

మదరాసు, సెప్టెంబరు 16: ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సంఘం వారు మొన్న నెల్లూరులో సమావేశమైనప్పుడు కృష్ణా పెన్నారు పులిచింతల ప్రాజెక్టులను గూర్చి విచారణ చేసి రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షునికి నివేదికను సమర్పించే నిమిత్తం ఒక ఉపసంఘాన్ని నియమిస్తూ ఒక తీర్మానం చేశారు.

తీర్మాన పాఠం:

"కృష్ణా పెన్నారు ప్రాజక్టు పులిచింతల ప్రాజక్టు నిర్మాణాల విషయంలో భిన్నాభిప్రాయాలతోకూడిన వివిధ ప్రకటనలను యీసంఘం స్మరిస్తోంది. కృష్ణా పెన్నారు ప్రాజక్టు ప్రధానంగా ఆంధ్రేతరప్రాంత శ్రేయస్సుకొరకు ఉద్దేశింపబడినదనెడి తీవ్ర ఆరోపణలు కూడా చేయబడుటను ఈ సభవారు గమనించి యీ ప్రాజక్టులు ఏఏ ప్రాంతానికి ఎంతెంతగా ఉపయోగపడునది, పూర్తిగా విచారించి విషయాలన్నీ సేకరించి ఆంధ్రజాతి క్షేమం నుంచి నిర్మాణాత్మకమైన నివేదికను ప్రదేశ్ కాంగ్రెసు సంఘ అధ్యక్షులకు సమర్పించవలసిందిగా యీ క్రింది వారిని కోరుచు తీర్మానించనైనది.

(1) శ్రీ కడప కోటిరెడ్డి, 2 నిడమర్తి వెంకటసుబ్బయ్య, 3. మోటూరి సత్యనారాయణ, 4. కాసు బ్రహ్మానందరెడ్డి, 5. ఎ. సి. సుబ్బారెడ్డి, 6. మాగంటి బాపినీడు, 7. టి. ఎన్. వెంకటసుబ్బారెడ్డి, 8. పేట బాపయ్యగారు. అవసరమగు శాస్త్రజ్ఞులను కోఆప్టు చేసుకొనడానికి యీ సంఘములోవారికి అధికారమీయడమైనది."

### సవరణ

16 తేదీ ఆంధ్రపత్రిక శ్రీ పర్వం రాజుగారి తీర్మానమునకు శ్రీ పైడి నరసింహప్పారావుగారు వ్యతిరేకంగా మాట్లాడినట్లు పడింది. తీర్మానమునకు వ్యతిరేకముగా మాట్లాడింది శ్రీ జి. వి. అప్పారావుగారు అని గమనించ కోరుతున్నాం.

# ముఖ్యమంత్రికి కృపలానీ జవాబు

మద్రాసు, సెప్టెంబరు 16: మదరాసు ముఖ్యమంత్రికి సమాధానంగా కృపలానీగారు ఈ ప్రకటన చేస్తున్నారు. "సి. ఐ. డీలను నా వెంట పంపడాన్ని గూర్చి ముఖ్యమంత్రి చేసిన ప్రకటన చూశాను. తమ అధికారం ఎంతో, హద్దుఎంతో తెలియనివారు హఠాత్సంఘటనవల్ల అధికారంలోకి వస్తే తమకు, ప్రజకూ గూడా ప్రమాదకరంగా పరిణమిస్తారు. ప్రజాస్వామ్యంలో వున్నామని ముఖ్యమంత్రి తెలుసుకోవలసి ఉన్నది. ఎన్నికల్లో అధికారంలో వున్న ప్రభుత్వానికి హక్కు ఎంతవుందో, ప్రతిపక్షానికీ అంతే వుంది. మామీద సి. ఐ. డీలను వేసి, రిపోర్టులు తీసుకుంటామంటే వారిపై పనిచేసే సి. ఐ. డీలను మాకుగూడా ప్రజాద్రవ్యం వినియోగంతో వేయించాలి. లేకపోతే మాకూ వారికి గూడా పత్రికలని వేదికలు చాలు. ఎన్నికల ముందు ఎంత విప్లవవాది అయినా ఓట్లతోనే ప్రభుత్వాన్ని మార్చగోరుతాడు, ఎన్నికలకాలంలో ఐ. పి. సి. 124 ఎ. వుండదని విజ్ఞులైన ముఖ్యమంత్రికి తెలియదు. అట్లే, చర్చిల్‌పై సి. ఐ. డి. లను ఎన్నికలముందు వేశారా? ప్రివెంటివ్ డిటెన్షన్ ఆర్డినెన్సు క్రిందో, మరి ఏ ఆర్డినెన్సు క్రిందనో నన్ను పట్టుకు వేటంతె గ్రంథం వారికి నేను లభింపచేసే ఉన్నాను. వారేమి మాట్లాడుతున్నారో వారికే తెలియడంలేదు."

# పత్రికల బిల్లు

(1 వ పేజీ తరువాయి)

రతు. జ్యూరీ సహాయంతో న్యాయమూర్తులు కేసును విచారించి తీర్పు చెబుతారు; ముద్దాయి కావాలనుకుంటే ఆ న్యాయమూర్తి తీర్పుమీద హైకోర్టుకు అప్పీలు చేసుకోవచ్చు.

జడ్జీనీ, జ్యూరీనీ, హైకోర్టునూ, ఎవ్వరినీ నమ్మజాలం అని మీరు అనేటట్లయితే, మీ పత్రికలవారిని నమ్మజాలనని నేనంటాను.

144 వ సెక్షన్‌ను యెందుకు రద్దు చెయ్యలేదని గుప్తగారు ప్రశ్నించారు. నేను న్యాయంగా విజ్ఞప్తి చేసుకోగోరుతున్నదేమంటే, కొలంలో ఈ శాసు ఇంత తక్కువ వ్యయప్రయాసలతో మనం శాంతిభద్రతలను కాపాడగల్గుతున్నామంటే, అది నిజానికి యీ సెక్షన్ ఉండబట్టే సాధ్యం అవుతున్నది. నా అభిప్రాయంలో దీనిని రద్దుచెయ్యడం లేనిపోని కొత్త చిక్కులను అనవసరమైన వ్యయప్రయాసలను నెత్తికెత్తుకోవడమే అవుతుంది.

ప్రభుత్వం ప్రెస్‌కమిషన్‌ను నియమించాలనే ఆలోచనను విరమించుకోలేదు; కాని ఆకమిషన్ తాను నిర్వర్తించవలసిన పనిని పూర్తి చేసేటప్పటికి ఏడాదియైనా పడుతుంది. యీ బిల్లువల్ల క్రమమార్గంలో నడుచుకొనే పత్రికా రచయితలకేమీ భయంలేదు.

సెలెక్టు కమిటీ ఈ బిల్లులోని ప్రతిక్లాజునూ పునఃపరిశీలించి, చేయవలసిన మార్పు చేర్పులు ఏమైనా వుంటే సూచిస్తుంది. ఇందులో అవసరమైన సవరణలన్నిటినీ ప్రభుత్వం ఆమోదించగలదని హామీ ఇస్తున్నాను."

# ప్రాయోపవేశ విరమణకు స్వామిజీ షరతు

(1 వ పేజీ తరువాయి)

ఆంధ్రనాయకులు అందరూ ఏకాభిప్రాయం కుదుర్చుకోవాలనీ, చిత్తూరుజిల్లా విభజించటం తగదనీ తెలుపుతూ మద్రాసు కౌన్సిల్ అధ్యక్షుడు ఆర్. బి. రామకృష్ణరాజుగారు స్వామిజీకి లేఖ వ్రాశారు. మద్రాసునగరం ఆంధ్రరాష్ట్రంలో కానీ, లేదా తమిళనాడులో కానీ చేర్చవలసి వుంటుందని కూడా రామకృష్ణరాజు గారు తమ లేఖలో అన్నారు.

## దీక్షాపరుల స్థితి

గుంటూరు, సెప్టెంబరు 16: సత్వర ఆంధ్రరాష్ట్ర సంపాదనార్థమై స్వామి సీతారాం ప్రభృతులు ప్రాయోపవేశ దీక్ష ప్రారంభించి యివాళటికి 33 రోజులు. దీక్షాపరులంతా చాలా నీరసించిఉన్నారు. వినయాశ్రమ దంపతులు బసవయ్యదుర్గాంబగార్లను ఆస్పత్రిలో చేర్చారు. అయినా వారింకా దీక్ష సాగిస్తునే ఉన్నారు.

రాయలసీమవాసి ఆర్. కె. రామలింగారెడ్డిగారు, స్వామిజీ అనుజ్ఞ చొప్పున యివాళ దీక్ష విరమించారు.

ప్రస్తుత పార్లమెంటు సభ్యులు డా॥ పట్టాభి సీతారామయ్యగారు కేంద్ర, రాష్ట్ర శాసనసభలలో దేనికి దరఖాస్తు పంపలేదు.

మద్రాసు మంత్రులు గోపాలరెడ్డి, చంద్రమౌళి, సీతారామరెడ్డి, సంజీవరెడ్డిగారలున్నూ, అయ్యదేవర కాళేశ్వరరావుగారు రాష్ట్ర శాసనసభా సభ్యత్వాలకు దరఖాస్తు పంపారు.

ఆంధ్రప్రదేశ్ ఎన్నికల కమిటీ ఆయా ప్రదేశాల అభ్యర్థుల యోగ్యతలను విచారించేందుకు నిన్న పర్యటన ప్రారంభించింది.

### పాకాల సుబ్బారావుగారి ఉపవాస విరమణ

గుంటూరు, సెప్టెంబరు 16: స్వామి సీతారాం బృందంతోపాటు సెప్టెంబరు 1 నుంచి ఉపవాసం చేస్తున్న పాకాల సుబ్బారావుగారు రక్తవిరోచనాలతో బాధపడుచుండుటవల్ల, నేడు ఆయన ఉపవాసం విరమించారు. స్వామిజీతో ఉపవాసం చేస్తున్న నేతి చలపతిగారి భార్య శ్రీమతి సుందరమ్మగారు, సుబ్బారావుగారికి నారింజరసం ఇచ్చారు.

### తెనాలిలో ఉపవాసకేంద్రం

గుంటూరు, సెప్టెంబరు 15: స్వామి సీతారాం దీక్షకు సానుభూతిగా, తెనాలిలో ఒక ఉపవాస కేంద్రాన్ని ప్రారంభించటానికి బ్రహ్మాండం నరసింహంగారికి స్వామిజీ అనుమతి నిచ్చారు. సెప్టెంబర్ 9 నుంచి ఉపవాసం చేస్తున్న కృష్ణల్లాండ బాబూరావుగారు తెనాలిలో దీక్షను కొనసాగిస్తున్నట్లు స్వామిజీకి తెలియవచ్చింది. (స్వ. వి)

### మదరాసు ఆంధ్ర విద్యార్థుల తీర్మానం

మదరాసు, సెప్టెంబరు 16: నగరంలోని వివిధ కళాశాలల్లోని ఆంధ్ర విద్యార్థులు నిన్న రాత్రి కీల్పాక్‌లోని ఆంధ్రాలాడ్జిలో సమావేశమై "సత్వర రాష్ట్రనిర్మాణాన్ని వాంఛిస్తూ శ్రీ స్వామి సీతారాంగారు ప్రారంభించిన ప్రాయోపవేశ దీక్షను బలపరుస్తూ కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలను వెంటనే రాష్ట్రనిర్మాణానికి తగు చర్యలను గైకొనమని కోరుతూ, వివాదగ్రస్తమైన విషయాలను మధ్యవర్తిత్వానికి వదలి, వివాదంలేని ప్రాంతాలలో రాష్ట్రనిర్మాణాన్ని వాంఛిస్తూ" తీర్మానించారు.

"సోమవారం 17 తేదీన గవర్నమెంటు భవనంముందు స్వామీజీ దీక్షను బలపరచుటకున్నూ, ప్రభుత్వమునకు తమ అసమ్మతిని తెలియజేయుటకున్నూ ఒకరోజు ఉపవాసము చేయుటకున్నూ, 17 వ తేదీన గుంటూరులో జరుగనున్న అఖిలపక్ష సమావేశాన్ని జయప్రదం కావాలని కోరుతూ" మరొక తీర్మానం చేశారు.

17 వ తేదీన జరుగబోవు నిరసన ప్రదర్శనలో ఆంధ్రవిద్యార్థి సోదరులందరూ పాల్గొనాలని విజ్ఞప్తిచేశారు.

# కేసాంగు ప్రాంతపు తాటస్థ్యానికి భంగం

### సమితి బలాలపై పెకింగు రేడియో కొత్త ఆరోపణ

టోకియో, సెప్టెంబరు 15: సమితి బలాలు మరొక పర్యాయం కేసాంగు ప్రాంతపు తాటస్థ్యాన్ని భగ్నపరిచినవని పెకింగు రేడియో నేటిరాత్రి ఆరోపించినది. ఒక అమెరికన్ ఫైటర్ విమానం నేటి ఉదయం 20 నిమిషాల సేపు కేసాంగుచుట్టూ ప్రదక్షిణంచేసి తిరిగి పోయినదని ఒక విలేఖరి తెలియపరిచినట్లు ఆ రేడియో సూచించినది. బాంబులు వేయడంకాని, శతఘ్నికాల్పులుకాని జరుగలేదనికూడా ఆ విలేఖరి తెలియపరిచాడు.

ఒక్కపర్యాయం మాత్రమే కేసాంగు ప్రాంతపు తాటస్థ్యాన్ని భగ్నపరిచినట్లు సమితి అధికారులు అంగీకరించినంతమాత్రంచేత కమ్యూనిస్టులు సంతృప్తిచెందరనీ, వెనుకటి అన్ని సంఘటనలను శాశ్వతంగా అంగీకరిస్తూ, ఇకముందు అట్టివి జరుగవని జనరల్ రిడ్జివే ఇవ్వాలని పెకింగురేడియో సూచించినది.

# హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ బిల్లు

### కాంగ్రెస్‌పార్టీ నిర్ణయం: 17 న పార్లమెంటులో చర్చ

న్యూఢిల్లీ సెప్టెంబరు 15: పార్లమెంటు నందలి కాంగ్రెస్ పార్టీవారు నేటి సభలో హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణబిల్లు సూత్రాలపై వివరంగా చర్చసాగించారు. ఈబిల్లును చర్చించడానికి కొన్నాళ్లనుండి కాంగ్రెస్ పార్టీ ప్రతిరోజూ సమావేశమవుతున్నది. నేటి సభలో పార్టీవారు రెండవ సూత్రం నుండి 39 వ సూత్రం వరకు గల సూత్రాల నన్నిటిని ఆమోదించారు. ఈసూత్రాలు వివాహశబ్ద నిర్వచనకు, విడిపోయిన దంపతులను తిరిగి కలపడానికి, కోర్టుద్వారా దంపతులను వేరుచేయడానికి సంబంధించి వున్నవి. విడాకులకు సంబంధించిన సూత్రాలను పార్టీవారు సోమవారం నాడు చర్చిస్తారు.

ఏకపత్నీ వ్రతానికి సంబంధించిన సూత్రాన్ని సభవారు ఏకగ్రీవంగా ఆమోదించారు. ఈసూత్రం ద్వారా హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణబిల్లు నందలి షరతులకును, ఐ. పి. సి 495 సెక్షనునందలి షరతులకును పరస్పర సంబంధం వుంటుంది. ధార్మిక వివాహములను తప్పక రిజిస్టరు చేయాలనే షరతు అక్కరలేదని ఇట్టి ధార్మిక వివాహాల రిజిస్ట్రేషను ఐచ్ఛికమై వుండాలని సభవారు నిర్ణయించారు.

వివాహానికి, విడాకులకు మధ్య ఒక దశ అయిన దాంపత్యాధికార పునస్సంధానము, కోర్టుద్వారా దాంపత్య వియోగమునకు సంబంధించిన షరతులను సభవారు అత్యధిక సంఖ్యాకముగు వోట్లతో ఆమోదించారు.

ప్రస్తుత సూచనల ననుసరించి పార్లమెంటువారు సోమవారము నాడు హిందూధర్మశాస్త్ర క్రోడీకరణ బిల్లును విచారణలోనికి తీసికొని ఒక భాగం తరువాత మరియొకభాగాన్ని శాసనం చేస్తారని తెలుస్తున్నది. బిల్లును క్రమేపి ఒకభాగం తరువాత ఒక భాగాన్ని శాసనం చేయాలని రావు కమిటీవారు కోరి వుండిరి.

కాంగ్రెస్‌వారు ఆమోదించిన భాగాలనైనా పార్లమెంటువారు ఈ సమావేశంలో ఆమోదిస్తారా? అనే విషయమై బిల్లుకు అనుకూలురు ప్రతికూలురు గూడ సంశయగ్రస్తులై వున్నారు.

### ఆంధ్రోద్యమ సభ

మదరాసు, సెప్టెంబరు 16: ఆంధ్రరాష్ట్ర నిర్మాణం గూర్చి 17 తేది సా. 6–0 లకు రాయపేటలోని ఆంధ్రవిజ్ఞాన సమితి కార్యాలయంలో సభజరుగుతుందని మద్రాసు ఆంధ్ర విద్యార్థి సంఘ కార్యదర్శి వ్రాస్తున్నారు.

### తపాలా పనివారిసభ

సికిందరాబాదు, సెప్టెంబరు 15: మద్రాసు సర్కిల్ మొట్టమొదటి తపాలాపనివారి సమావేశం రేపటిదినం ఇక్కడ జరుగుతుంది. పోస్టుమాస్టర్ జనరల్ మేజర్ సి. యం. రాజంగారు సభను ఉపక్రమిస్తారు.

## సారాదగ్గర వుంచుకొన్నందుకు రు. 50 జుల్మానా

రాజోలు, సెప్టెంబరు 7: స్పెషల్ సబ్ మేజిస్ట్రేటు అయ్యగారి విశ్వేశ్వరరావుగారు అడ్డాల సాలెంకొపురస్థుడు చెల్లుబోయిన తాతయ్య అనువానికి, సారా దగ్గర వుంచుకొన్న నేరానికిగాను రు 50 జుల్మానా విధించారు. మల్కిపురం సైపన్ సిబ్బంది యీ కేసును పట్టి, ముద్దాయివద్దనున్న సారా సీసాను స్వాధీనం చేసుకొన్నారు.

## నోటీసు

ఏలూరు జ. సబ్ కోర్టులో

వాది: మొవ్వుసూట్ల వెంకన్న గారు.
ప్రతివాదులు: కాపం నాగరత్నం వగైరా

ఈ నెంబరు [illegible] నాడు ల తాలూకు [illegible] క్రింద ఉదహరించిన ఆస్తి సదరు కోర్టువారి యెదుట 24—9—51 తేదిని రు. 10 గంటలకు లగాయతు వేలము వేయబడును.

ఆస్తి వివరం: పశ్చిమ గోదావరి జిల్లా తాడేపల్లిగూడెం తాలూకా పెంటపాడు సబ్ రిజిస్ట్రారులో చేరిన ప్రత్తిపాడు గ్రామములోని మొఖాసా యీనాం మెరక నం. 147 రు యి 6.94 ట్లలో మహజర్లు ప్రకారం యి 2.75 ట్లుకు రివిజన్ సర్వే నం. 62/3 గులో కొత్త సర్వే ప్రకారము యి 2.40 ట్లు, యిందులోని రైసు మిల్లు, 16 హార్సు పవర్ బాయిలర్ వగయిరా మెషినరీయున్నూ, షెడ్డులు, కొట్లు, వగైరా కట్టడములు సహా.

కె. ఎస్. ఆర్. అప్పారావు,
డిక్రీ హోల్డరు తరఫు అడ్వొకేటు.

## రాళ్ళపాడు ప్రాజక్టు

### నెల్లూరుజిల్లాలో అదనంగా 8 వేల ఎకరాల సాగుబడికిపీలు

### మంత్రి భక్తవత్సలంగారిచే శంకుస్థాపన

నెల్లూరు, సెప్టెంబరు 13: ఎప్పుడో కట్టదలచుకొంటున్న కృష్ణా పెన్నారు ప్రాజెక్టువల్ల రాళ్ళపాడు రిజర్వాయరుకు ఎంతో నీరు వస్తుందని, ఇప్పుడు దాని విస్తృతిని ఎట్లా తగ్గించింది ఆ ప్రాజెక్టు రిజర్వాయరు ప్రాజెక్టును ప్రారంభిస్తూ చీఫ్ ఇంజనీరు వివరించారు.

ఈ సందర్భంలో ఆయన పూర్వం వేసిన పథకాల నన్నింటిని క్లుప్తంగా వివరించి, ప్రస్తుతం కొన్ని మార్పులతో అమలు జరుగుతున్న పథకాన్ని ఆయన ఈవిధంగా విశదం చేసారు: రాళ్ళపాడు ప్రాజెక్టును రెండు దఫాలుగా నిర్మించాలని నీటిపారుదల చీఫ్ ఇంజనీరు సూచించారు. ఈ రెండు దఫాలలో మొదటి దఫాగా పూర్తి కావలసింది వీరరాఘవునికోట ఆనకట్ట స్కీము. రెండో దఫాగా పని పూర్తి చేయవలసింది రిజర్వాయరు స్కీము. 1949 లో ప్రభుత్వం ఆనకట్ట స్కీమును ప్రారంభించింది. అయితే ఈ స్కీము ప్రకారం రిజర్వాయరు చాలా పెద్దదిగా కట్టవలసి వుంది (8659 మిలియన్ ఘనపుటడుగులు) ఎక్కువ నీరును నిల్వ వుంచి, ఈతిబాధలు కల్గినప్పుడు తట్టుకోడానికి వీలుగా కట్టబడవలసివుంది. కాని ఇకముందు ఎప్పుడో కట్టబోయే కృష్ణా పెన్నారు ప్రాజెక్టు తాలూకు నెల్లూరు ఉత్తరపుకాల్వ మూలంగా రాళ్ళపాడు రిజర్వాయరుకు నీళ్లు అందగలవన్న ఉద్దేశ్యంతో, ఈ రిజర్వాయరు విస్తృతిని తగ్గించాలని నిశ్చయింపబడింది. ఇప్పుడుకంటే ఈ రాళ్లపాడు రిజర్వాయరు విస్తృతి 1500 మిలియన్ ఘనపుటడుగులు మాత్రమే.

ఇక ఈ ప్రాజెక్టును ఎందుకు నిర్మిస్తున్నది ఆయన ఈవిధంగా వివరించారు. మన్నేరు వరదనీటిని పట్టి అదుపులో వుంచడానికి ఈ రిజర్వాయరు నిర్మించబడుతున్నది. ఈ కడుతున్న చోట వున్న గ్రామం రాళ్లపాడు కాబట్టి దీనికి పేరు పెట్టడం జరిగింది. ఇది పూర్తిఅయితే 8175 ఎకరాలకు పుష్కలంగా నీరు లభిస్తుంది. ప్రస్తుతం రెడ్డికాల్వ త్రవ్వ బడుతోంది. దీని ద్వారా మాచవరం, మోపాడు చెరువులకు నీరు అందుతుంది. ఇప్పుడు ఈ చెరువుల క్రిందవున్న 4670 ఎకరాల ఆయకట్టుకాక, మరో 2825 ఎకరాల నేల ఇందువల్ల తడుస్తుంది.

ఈ మొత్తం స్కీమును రాళ్లపాడు రెడ్డికాలవ స్కీము అంటారు. రెండు దఫాలుగా ఈపని సాగిపోతుంది. (1) మున్నేరుకు వీరరాఘవునికోటవద్ద ఆనకట్ట కట్టడం, ఈ ఆనకట్ట అప్పుడే పూర్తి కావస్తున్నది; మాచవరం, మోపాడు చెరువులకు నీళ్లు అందేందుకు కాల్వ త్రవ్వడం, ఇవి పూర్తి కావడానికి 10.9 లక్షలు ఖర్చు అవుతుంది. (2) ఈ రాళ్లపాడు రిజర్వాయరు నిర్మాణం. ఈరెండూ పూర్తిఅయితే మొత్తం 11 వేల ఎకరం సాగులోకి వస్తుంది.

ఈ రిజర్వాయరు కట్టడానికి 48 లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది. 1954 నాటికి పూర్తిఅవుతుంది. ఇప్పటినుంచి రోజుకు 50 మంది నిపుణులైనవారు, 780 మంది నిపుణులు కానివారు కూలీలు పనిచేయాలి. దీనికి కుడి ప్రక్కన కాలువను త్రవ్వడానికి ప్రత్యేకంగా 5 లక్షల రూపాయలు పైగా ఖర్చవుతుంది.

### ప్రాజెక్టు ప్రారంభోత్సవం

మద్రాసు, సెప్టెంబరు 14: నిన్న సాయంత్రం పబ్లిక్ వర్క్సు శాఖా మంత్రి భక్తవత్సలంగారు నెల్లూరు జిల్లాలో రాళ్లపాడు ప్రాజెక్టుకు శంకుస్థాపన మహోత్సవం జరిపారు. ఆర్థికమంత్రి బెజవాడ గోపాలరెడ్డిగారు అధ్యక్షత వహించారు.

## కాకినాడ హరిజననాయకుల సమావేశం

కాకినాడ, సెప్టెంబరు 11: నిన్న నిక్కడ పాము రామమూర్తిగారి అధ్యక్షతను జరిగిన హరిజన నాయకులసమావేశంలో రాబోయే ఎన్నికలలో హరిజన స్థానాలకు సమర్థులైన వారినే నిలబెట్టి అట్టివారినే ఆంధ్ర కాంగ్రెసుచే ఆమోదింప చేయాలని తీర్మానించుకొన్నారు. ఆయా నియోజకవర్గాలలో ప్రాబల్యంకల హరిజన నాయకులెవ్వరో తెలిసిన ఆంధ్ర కాంగ్రెసు అట్టి నాయకుల సలహాలనే పాటించాలని అభ్యర్థించారు.

## ఆంధ్రవిశ్వ విద్యాలయ స్నాతకోత్సవం

వాల్తేరు, సెప్టెంబరు 13: ఆంధ్ర విశ్వవిద్యాలయ స్నాతకోత్సవం డిసెంబరు 8 వ తేదీని జరుగుతుంది. ఛాన్సలర్, (మద్రాసు గవర్నరు) గారు అధ్యక్షత వహిస్తారు.

## వాలిచర్ల గ్రామంలో హత్య

కనిగిరి, సెప్టెంబరు 12: ఈ తాలూకాలోని వాలిచర్ల గ్రామంలో యీ 4 వాటేరాత్రి సీరా పోలయ్య (28) అను వతడు తనయింటి లోగిలిలో నిద్రపోతూవుండగా ఎవరో యిద్దరు దుర్మార్గులు వచ్చి బరిసెతో కుడికణతి మీద పొడిచి పారిపోయారు. పోలయ్య మరునాడు స్థానిక ప్రభుత్వ వైద్యశాలలో మరణించాడు. పంచనామా [illegible] యిద్దరు వ్యక్తులను ఐ. పి. సి. 302 సెక్షను క్రింద అరెస్టు చేశారు. కేసు విచారణ జరుగుతున్నది.

## కర్నూలుజిల్లా కాంగ్రెసు ఎన్నికలు

### పాణ్యం నియోజకవర్గ ఫలితం

నంద్యాల, సెప్టెంబరు 13: కర్నూలుజిల్లా కాంగ్రెసు సంఘమునకు పాణ్యం నియోజకవర్గంనుంచి పి. వి. రంగనాథరావుగారు ఎన్నికైనారు. ఎన్నికాధికారి బి. యల్. యన్. గాంధిగారు నిన్న స్థానిక విక్టోరియా రీడింగు రూంలో యీ ఎన్నిక జరిపారు. రంగనాథరావుగారికి, నియోజకవర్గంలోని 12 ఓట్లలో 7 ఓట్లు లభించాయి.

## అనంతపురం జిల్లా కాంగ్రెస్ అధ్యక్షత

### కల్లూరి సుబ్బారావుగారి ఎన్నిక

అనంతపురము, సెప్టెంబరు 13: అనంతపురముజిల్లా కాంగ్రెసు సంఘమునకు అధ్యక్షునిగా కల్లూరు సుబ్బరావు ఎం. ఎల్. ఎ. గారు ఏకగ్రీవముగా ఎన్నికైనారు. కె. వి. వేమారెడ్డిగారు (జిల్లాబోర్డు అధ్యక్షుడు) ఉపాధ్యక్షునిగాను ఎ. చిదంబరరెడ్డిగారు కార్యదర్శిగను మరికొందరు కార్యవర్గ సభ్యులుగాను ఎన్నుకోబడిరి. ఈ ఎన్నికలు నిన్న సాయంకాలము 4 గంటలకు జిల్లా కాంగ్రెసు భవనములో జరిగినవి.

## బరంపురం మునిసిపల్ ఎన్నిక ఫలితాలు

బరంపురం, సెప్టెంబరు10: ఈరోజు పురపాలక సంఘ సభ్యుల ఎన్నిక సందర్భంలో వోట్ల లెక్కింపు జరిగిన మీదట దిగువ పేర్కొన్నవారు ఎన్నికయినట్లు ప్రకటించబడింది:

1 వ వార్డు: ఎస్. ఎన్. ఆచారి 2 వ వార్డు; ఆర్. సి. మిశ్రో, 4 వ వార్డు - కె. ఎల్. ఎన్. సుబుద్ధి, 7 వ వార్డు — నారాయణ బెహెరి, 9 వ వార్డు-ఎ. ఎన్. దేవ్, 11 వ వార్డు - పాడుసుబుద్ధి, 14 వ వార్డు - గాదెనా రామమూర్తి, 15 వ వార్డు - పాకనాటి జగన్నాధరావు. 16 వ వార్డు - కొల్లి పోలాయి, 18 వ వార్డు - బలభద్ర మిశ్రో, 19 వ వార్డు - బొడొఖిమిడి రాజా, 20 వ వార్డు — బృందావన నాయక్, 21 వ వార్డు - బాసుదేవ పాత్రో, 22 వ వార్డు - శ్రీకృష్ణ పారిడా, 25 వ వార్డు - సూరావజ్జల జగన్నాథం, 26 వ వార్డు - ఈశ్వర సాహు గార్లు. (స్వ. వి.)

## విశాఖపట్టణంలో రోగులకు విశ్రాంతిభవనం

విశాఖపట్టణము, సెప్టెంబరు 10: అప్పన రామచంద్ర రావు గారు రోగుల వసతికొరకు కింగ్ జార్జి ఆసుపత్రి ప్రక్కన కట్టించిన విశ్రాంతి భవనానికి స్థానిక రోటరిసంఘ అధ్యక్షుడు, డా॥ కె. వాసుదేవరావుగారు (డైరెక్టరు ఆఫ్ మెడికల్ సర్వీసెస్) ప్రారంభోత్సవం జరిపారు. ధనికుల వితరణవల్లనూ, ప్రభుత్వ కృషివల్లనూ కొలది రోజులలో విశాఖపట్టణం ఆసుపత్రిలో 1000 మంది రోగులకు మంచాలు అమర్చబోతున్నారని వాసుదేవరావు గారు తెలిపారు. లెఫ్టినెంట్ కల్నల్ కె. వి. రమణారావు గారు, కింగ్ జార్జి ఆసుపత్రి తరఫున అప్పనవారి కుటుంబానికి ధన్యవాదాలర్పించారు. (స్వ. వి.)

## నందికొట్కూరు ఓవర్సీర్‌పై దౌర్జన్యంచేసినందుకు క్షమాపణ

కర్నూలు, సెప్టెంబరు 12: నందికొట్కూరు మైనర్ ఇరిగేషన్ ఓవర్సీర్ లక్ష్మణరావుగారిని అక్రమంగా నిర్బంధించి, స్వల్పంగా గాయపరచినందుకుగాను, 342, 323 సెక్షన్ల క్రింద, ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు సభ్యుడు పి. కోటయ్యనాయుడు గారిపై లోగడ కేసు పెట్టబడినది. కోటయ్యనాయుడు తాను చేసిన తప్పుకు లిఖితపూర్వకంగా క్షమాపణ చేసుకొన్నందున, ఇకముందు సవ్యంగా ప్రవర్తిస్తానని హామీ యిచ్చినందున, స్పెషల్ సబ్ మేజిస్ట్రేటు గారు నిన్న అతనిని విడుదల చేశారు.

## తప్పుడు తూనికరాళ్లు వుపయోగించిన వారికి జుల్మానాలు

జగ్గయ్యపేట, సెప్టెంబరు 8: వుపయోగించిన నేరాలకుగాను స్థానిక మేజిస్ట్రేటు కోర్టులో కె. కళ్యాణికి రు. 25 యు. భద్రయ్యకు రు 50 యు. వి. కృష్ణమూర్తి రు. 50 పి. ప్రకాశానికి రు. 50 జుల్మానాలు విధించారు.

## త్రాగిన నేరాలకు జుల్మానాలు

స్థానిక మేజిస్ట్రేటు కోర్టు నాగు త్రాగిన నేరాలకు వెంకట రామస్వామి కల్యాణం కృష్ణమూర్తి, వెంకటసుబ్బయ్య, [illegible] గంగయ్య అనువారికి తలా రు. 20 జుల్మానా విధించారు.

## పిల్లల దసరా పోటీలు

మదరాసు ఆంధ్ర బాలానందసంఘం వారు దసరా ఉత్సవాలు జరుపు సందర్భంలో పిల్లలకు కొన్ని పోటీలు ఏర్పాటుచేశారు. వ్యాసరచన, చిత్రలేఖనము, పాటలు, హాస్య వేషధారణ, నాటికలు మొదలగు పోటీలు ఉత్సవాలతోబాటు అక్టోబరు 5, 6 తేదీలలో వాణీమహల్ (త్యాగరాయనగర్)లో ప్రసంగములు ఏర్పాటు జరుపబడును. వివరాలు కోరువారు సంపాదకి (170, రాయపేట హైరోడ్డు) వ్రాసి తెలుసుకోవచ్చు.

## "శిస్తుతగ్గింపు చట్టం శాస్త్రీయ మైనదే"

### మద్రాసుహైకోర్టు తీర్పు

మద్రాసు, సెప్టెంబరు 14: మదరాసు ప్రభుత్వం గావించిన మదరాసు జమీందారీల శిస్తుతగ్గింపు చట్టము (1947) తరువాతి 1950 లోని సవరణ చట్టము న్యాయశాస్త్ర సమ్మతమైనదే నని యీవాళ మద్రాసు హైకోర్టులో ప్రధానన్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నార్, న్యా॥ వెంకట్రామయ్యర్ గార్లు తీర్పు యిచ్చారు.

పై చట్టము మూలిక రాజ్యాంగచట్టం ప్రకారం చెల్లజాలదని ప్రకటింపవలెనని కోరుతూ సర్టియోరారి ఉత్తరవు మంజూరు చేయవలసిందిగా దాఖలైన కొన్ని దరఖాస్తులను విచారణ చేసి న్యాయమూర్తులు పై తీర్పునిచ్చారు. ప్రభుత్వంవారు శిస్తుతగ్గింపు పేరుతో జమీందారీ భూములను ఎస్టేటు అసాములకు సరియైన పరిహారం యివ్వకనే స్వాధీనపరచుకొనడము న్యాయసమ్మతం కాదని దరఖాస్తుదారులు వాదనలో తెలుపుకొన్నారు. ఈ అంశము పూర్తి న్యాయమూర్తులు అభిప్రాయం వెల్లడిస్తూ ప్రభుత్వము రైతుల నుండి ఏజెంటుగా మాత్రమే శిస్తును వసూలు చేసి, తను ఖర్చులను మాత్రం పుచ్చుకొని తతిమ్మా భాగము జమీందారులకే యిస్తున్నారు గనుక భూములను ప్రభుత్వం భుక్తపరచుకొంటున్నదనే వాదనకు ఆస్కారం లేదన్నారు.

జమీందారీలలో యజమానులు అక్రమంగా యెక్కువ శిస్తులను వసూలు చేయ వీల్లేకుండా రైత్వారీప్రాంతాలలోని రేట్లకు శిస్తు తగ్గించడం ప్రజాహక్కులకు వ్యతిరేకముగా శాసించుట కాజాలదని జనసామాన్యం మేలు నుద్దేశించి శాసనం చేయుటకు హక్కు ఉన్నదనికూడా న్యాయమూర్తులు తీర్పులో తెలిపారు.

## శ్రీకాకుళంలో అఖిలపక్ష సభ

శ్రీకాకుళం, సెప్టెంబరు 8: నిన్న నిక్కడ గౌతు లచ్చన్నగారి అధ్యక్షతను ప్రజాపార్టీ కార్యాలయంలో జరిగిన అఖిలపక్ష సభలో జిల్లాలోని ప్రజాపార్టీ సభ్యులు హెచ్చుగా పాల్గొన్నారు. కాంగ్రెసు తప్ప మిగిలిన పార్టీల నాయకులు కూడా యీ సభకు వచ్చారు. రాబోయే ఎన్నికలలో ప్రజాపార్టీ మిగతా పార్టీలతో సహకరించి పనిచేయాలని నిశ్చయించడమైంది. స్వామి సీతారాంగారి వుద్యమాన్ని బలపరుస్తూ, సత్వర ఆంధ్రరాష్ట్ర విభజన జరిపించమని ప్రభుత్వాన్ని అర్థిస్తూ తీర్మానాలు చేశారు. (స్వ. వి.)

## శ్రీకాకుళంజిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యాలయ ప్రారంభం

శ్రీకాకుళం, సెప్టెంబరు 8: ఇక్కడ స్థాపితమైన జిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యాలయాన్ని మొన్న సాయంకాలం కోటికలపూడి గోవిందరావు గారు ప్రారంభోత్సవం చేశారు. ఆ సందర్భంలో జిల్లాబోర్డు సభ్యుడు శ్రీ వంద కృష్ణమూర్తిగారి అధ్యక్షతను జరిగిన సభలో గోవిందరావుగారు కాంగ్రెసు పరిపాలనా విధానాలను విమర్శించారు. (స్వ. వి.)

## శ్రీకాకుళం జిల్లా జాలర్లకు నూలు, తెరచాపల సరఫరా

శ్రీకాకుళం, సెప్టెంబరు 8: ఈ జిల్లాలోని కోస్తాప్రాంతాల పల్లెవారికోసం ప్రత్యేకంగా ఏర్పడ్డ 23 పరపతి సంఘాలద్వారా, అందుగల 4,300 మంది సభ్యులకు మనిషి 1 కి 2 చిలపలు చొ॥న నెలకు 11 కౌన్ల నూలు, 25% ధర తగ్గించి యిస్తున్నామని ఫిషరీస్ శాఖ యిన్‌స్పెక్టరు డన్నిరామన్ గారు తెలిపారు. ఇదిగాక తెరచాపలకై ప్రత్యేకమైన రకపు గుడ్డను 7 వేల గజాలు సరఫరా చేయబోతున్నామని కూడా తెలిపారు. 'బెంగాల్ కార్ప్‌ఫిష్' అనే కొత్త రకం చేపలను యిక్కడ ప్రవేశపెట్టారు. (స్వ. వి.)

## శ్రీకాకుళం జిల్లా మద్యనిషేధ ఉల్లంఘన నేరాలు

శ్రీకాకుళం, సెప్టెంబరు 8: జిల్లాలో జూన్ నెలలో 210, జులై నెలలో 236 మద్య నిషేధచట్ట వుల్లంఘన నేరాలు పట్టుబడ్డాయి. బోరువలలో ఈతిబెల్లం వుత్పత్తికిగాను సహకార పద్ధతులపై ఒక కేంద్రాన్ని స్థాపించారు. పెద్దపాడు పాలసరఫరా కేంద్రానికి పసువుల క్రయానికిగాను ప్రభుత్వం రు. 10 వేలు వడ్డీ లేని అప్పు యిచ్చింది. ఈ వివాదాలు ఇటీవల జిల్లాకలెక్టరు ఎస్. భగవాన్ దాసు గారి అధ్యక్షతను జరిగిన మద్యనిషేధ సలహా సంఘ సభ్యుల సమావేశంలో వెల్లడించారు. (స్వ. వి.)

జిల్లా కలెక్టరుకు కార్యదర్శిగా పనిచేసిన సి. నాగోజీరావుగారు మదరాసుకు బదిలీ అయిన సందర్భంలో పౌరులు యీ 2 న వారి గౌరవార్థం విందుచేశారు. సభకు మునిసిపల్ చైర్మన్ నేతి వెంకట్రావునాయుడుగారు అధ్యక్షత వహించారు. తిమ్మరాజు శివరావు, పసుమర్తి వెంకట సుబ్బారావు ప్రభృతులు ప్రసంగించారు.

## సవరణ

విశాఖపట్టణంలో పీటీ సరఫరా ప్రభుత్వంవద్దకు రాయబారం అన్న శీర్షిక క్రింద యీ 15 వ తేదీ పత్రికలో ప్రచురింపబడిన వార్త, విజయనగరమునకు సంబంధించిన వార్త అని పాఠకులు గమనింప ప్రార్థన.

## సోషలిస్టు, ప్రజాపార్టీల ఎన్నికల పొత్తు

### ప్రకాశంగారితో జయప్రకాష్ సంప్రదింపులు

విజయవాడ, సెప్టెంబరు 13: అఖిల భారత సోషలిస్టు పార్టీ నాయకుడు జయప్రకాష్ నారాయణ ఈ 16 వ తేదీన మద్రాసులో, ఆంధ్ర కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ నాయకుడైన ప్రకాశంగారిని కలుసుకొని, ఉభయ పార్టీలు ఎన్నికలలో పొత్తుకలిసే అవకాశమేమైనా ఉన్నదేమో చర్చిస్తారని నేడిక్కడ రూఢిగా తెలియవచ్చినది. ముద్దూరి అన్నపూర్ణయ్య, కొమ్మారెడ్డి సూర్యనారాయణగారలు గూడ యీ సంప్రదింపుల్లో పాల్గొంటారని తెలుస్తున్నది. (స్వ. వి.)

## పశ్చిమ గోదావరిజిల్లా కి. మ. ప్రజాపార్టీ అడ్‌హాక్ కమిటీ

తాడేపల్లిగూడెం, సెప్టెంబరు 11: ఈ జిల్లాలోని కిసాన్‌మజ్దూర్ ప్రజాపార్టీ సానుభూతిపరులు రాయుడు గంగయ్యగారి అధ్యక్షతను నిన్న యిక్కడ సమావేశమైనారు.

జిల్లా కార్యవర్గసభ్యులుగా యీ దిగువవారిని ఏకగ్రీవముగా యెన్నుకొన్నారు. శ్రీయుతులు మంత్రిప్రగడ వేంకటరాజారావు, కానుమిల్లి పట్టాభిరామయ్య, కిలారి కోటయ్య, దాట్ల సీతారామరాజు, గాదిరాజు జగన్నాధరాజు, రాయుడు గంగయ్య, చుండూరు రత్తమ్మ, పోలిశెట్టి వెంకటసుబ్బారావు, గద్దె విష్ణుమూర్తి, యస్. కె. వి. కృష్ణావతారం, కేని రామారావు గార్లు, కార్యదర్శులుగా పసల సూర్యచంద్రరావు, వీరమాచనేని వెంకటనారాయణ, గొట్టిముక్కల వెంకన్న గార్లు, జిల్లా ఆర్గనైజరుగా గొట్టిముక్కల రామచంద్రరాజు, ఆర్థిక కమిటీ సభ్యులుగా ముళ్లపూడి హరిశ్చంద్రప్రసాద్ (కన్వీనరు) భూపతిరాజు వెంకటసుబ్బ తాతరాజు, కొమ్మారెడ్డి సూర్యనారాయణ, ముచ్చర్ల వెంకటసుబ్బరాజు, రాఘవరాజు సూర్యనారాయణ రాజుగార్లు. ప్రచారకమిటీ సభ్యులుగా చెరుకువాడ సుబ్బారావు (కన్వీనరు,) గద్దె విష్ణుమూర్తి, ఆయ్యగారి వీరేశ్వరరావు, చింతలపాటి లచ్చిరాజు, భోండా కోటేశ్వరరావుగార్లు ఎన్నికైనారు. జిల్లా హెడ్ అడ్‌హాక్‌కమిటీ సభ్యులుగా 100 మందిని ఎన్నుకొన్నారు. ఎన్నికలు స్వేచ్ఛా వాతావరణంలో జరుపుటానికి యెట్టిషరతులు లేకుండా, రాజకీయఖైదీలను, విచారణ లేకుండా నిర్బంధించిన డిటెన్యూలను, వెంటనే విడుదల చేయవలసిందని భారత ప్రభుత్వమును కోరుచూ తీర్మానం చేశారు. స్వామి సీతారాంగారి వుద్యమానికి సానుభూతి ప్రకటించారు. ఈ జిల్లాలో గల మద్రాసు శాసన సభ్యత్వాలు పన్నెండిటికీ, పార్లమెంటు, కౌన్సిల్ స్థానాలకు, ప్రజాపార్టీ తరఫున అభ్యర్థులను నిలబెట్టాలని తీర్మానించారు. అఖిల కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ నాయకుడు ఆచార్య కృపాలనీ, ఆంధ్రకిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ నాయకుడు టంగుటూరి ప్రకాశం పంతులు గార్లను యీ జిల్లాలో పర్యటించవలసిందిగా కోరారు. జిల్లా కార్యాలయాన్ని తాడేపల్లిగూడెంలో స్థాపించాలని తీర్మానించారు. జిల్లాఆఫీసు నిర్వహించుటకుగాను రు. 2 వేల విరాళం వచ్చింది. (స్వ. వి.)

## యలమంచిలికి సివిల్‌సప్లయిస్ డైరెక్టరు రాక

యలమంచిలి, సెప్టెంబరు 9: మద్రాసు సివిల్ సప్లయిస్ శాఖ డైరెక్టరు- ఎం. ఎ. కుట్టాలలింగంపిళ్లెగారు విశాఖజిల్లా ఆహార పరిస్థితిని పరిశీలించటానికిగాను పర్యటిస్తూ నిన్న నిక్కడకు వచ్చారు. ప్రస్తుతం ప్రభుత్వం ఇస్తున్న ఎర్రజొన్నల మూలంగా కీళ్లనొప్పులు మొదలైన అనేక రకాల వ్యాధులు వస్తున్నాయని ప్రజలాయనకు మొరపెట్టుకొన్నారు. ఇంకా రు.40 లక్షలు విలువచేసేఎర్రజొన్నలు దిగుమతి అయినాయనీ వాటిని ప్రజలు ఎలాగైనా సరే ఖర్చు చేయవలసిందేనని చెప్పి పిళ్ళేగారు కారులో విశాఖపట్నం వెళ్లిపోయారు. వీరితోపాటు జిల్లా సరఫరాధికారి ఎం. కామేశ్వరరావుగారు కూడా పర్యటిస్తున్నారు.

## ఎ. పి. సి. సి. కి తాడేపల్లి గూడెం మహాజనసభ విజ్ఞప్తి

తాడేపల్లిగూడెం, సెప్టెంబరు 13: మద్రాసు పట్టణంతో సహా, వివాదగ్రస్త అంశాల నన్నిటినీ మధ్యవర్తి పరిష్కారానికి వదిలి వేస్తూ, ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అజమాయిషీలో ఉన్న ప్రాంతంతో అక్టోబరు 2 లోగా ఆంధ్రరాష్ట్ర నిర్మాణమే ప్రస్తుత విషమ పరిస్థితిని తొలగించటానికి ఆచరణ సాధ్యమై, న్యాయ సహితమైన మార్గం కాగలదని తెలుపుతూ యీ తాలూకా మహాజన సభవారు ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు నీలం సంజీవరెడ్డిగారికి తంతి ద్వారా విన్నవించారు. (స్వ. వి.)

## పెద్దపులి వధ

కాకినాడ, సెప్టెంబరు 9: గొల్లకొండ ఏజన్సీలోని బాలారం గ్రామంలో కెప్టెన్ బి. వి. ఎల్. రాజాగారు (కాకినాడ) మొన్నరాత్రి 7 అడుగుల 2 అంగుళాల పొడవున్న పెద్దపులి నొకదానిని చంపారు. గడచిన 2 నాసాలుగా యీ వ్యాఘ్రం ఆ తాలూకాలోని 26 పశువులను పొట్టను పెట్టుకొని ప్రజలనందరనూ హడలగొట్టినది. స్వ. వి.

## ఈ ఏడాది మంచి పంట ఉండవచ్చు

### వ్యవసాయమంత్రి అభిప్రాయం

మద్రాసు, సెప్టెంబరు 14: 'క్రిందటేడుతో పోల్చి చూసినప్పుడు ఈ ఏడాది మంచిపంట ఉండవచ్చు. నవంబరు వడితేగాని ఇదమిద్ధమని చెప్పడానికిలేదు. పశ్చిమ కోస్తాలో తృప్తికరంగానే వర్షాలుపడి పంటలు బాగానే ఉన్నవి' అని మద్రాసు వ్యవసాయమంత్రి ఎ. బి. షెట్టిగారు నేడు పత్రికా ప్రతినిధుల సభలో చెప్పారు. 'డెల్టా పంటనే ఫలితమిచ్చే అత్యవసర ప్రణాళికలు వదిలిపెట్టి, నిష్ప్రయోజక స్కీములు అమలు చేసినందువల్ల సస్యాభివృద్ధి కార్యక్రమం విఫలమైందిగదా' అని ఒక పత్రికా ప్రతినిధి అడగ్గా వ్యవసాయ కార్యదర్శి ఆర్. ఎం. సుందరంగారు: "డెల్టా ప్రాంతాల్లో మేము చెయ్యగలిగిందంతా చేశాము. కృష్ణాజిల్లాలో ఇప్పుడు తొమ్మిదిలక్షల ఎకరాలు మొదటిపంట, మూడులక్షల ఎకరాలు రెండోపంట ఉంటే మరో ఆరులక్షలు రెండోపంట స్కీములు వెయ్యమనడం "పాలిటెక్సు" అని అన్నారు.

ప్రభుత్వోద్యోగులకు గూడా 'పాలిటెక్సు' ఉన్నాయా అని అడగ్గా 'లేవు' 'లేవు' అన్నారు.

ఇంతవరకు సస్యాభివృద్ధికై జర్గిన యత్నాలు సఫలం గాకపోవడానికి కారణం కాలమాన పరిస్థితులు అనుకూలం గాకపోవడమేననీ, సస్యాభివృద్ధి యత్నాలు లేకపోతే ఆహారధాన్యాల లోటు ఇంకా ఉండేదని అన్నారు.

## కృత్రిమ వర్షసాధన

### మద్రాసుప్రభుత్వ ఆలోచన

మద్రాసు, సెప్టెంబరు 14: కృత్రిమంగా వర్షం కురిపించే ఆలోచన మూడేళ్ళక్రితం ఒకసారి మద్రాసు ప్రభుత్వ ఆలోచనకు వచ్చిందనీ, ఇంతలో వానలు కుర్సినందువ ఆ ఆలోచన విరమింపబడిందని అభివృద్ధి శాఖా కార్యదర్శి లోబో ప్రభుగారు నేడు పత్రికా ప్రతినిధుల సమావేశంలో తెలిపారు. ఇంకా ఆ ఆలోచన విరమించబడలేదన్నారు. పూర్వ ప్రధాని రామస్వామిరెడ్డిగారు ఆఆలోచనకు అంత ప్రోత్సాహం ఇవ్వలేదన్నారు. వ్యవసాయమంత్రి ఇది ఆచరణ సాధ్యమయ్యే వ్యవహారంగా కనిపించలేదన్నారు.

## బొంబాయి ఎక్స్‌ప్రెస్‌లో న్యాయవాది మృతి

మద్రాసు, సెప్టెంబరు 15: బొంబాయినుంచి యీ ఉదయం మద్రాసు వచ్చిన ఎక్స్‌ప్రెస్‌బండి తాలూకు ఒక పెట్టెలో, పరసవాకం గంగాధర్ కోయిలవీధి నివాసి, న్యాయవాది అయిన టి. వి. రాజగోపాల్ మృతి చెంది ఉన్నాడు. ఈయన మరణమునకు కారణమేమో తెలియదు.

తెనాలి, సెప్టెంబరు 13: ఇచట సుప్రసిద్ధ డోలు విద్వాంసులు గుంటపల్లి గురవయ్యగారు, గత 30 వ తేదీన మృతి చెందారు. వీరివద్దఆ నేకమందివిద్య నభ్యసించారు. గురవయ్యగారికి, నాగస్వరంలో విద్వాంసులైన వీరుదుకుమార్లు ఉన్నారు. (స్వ. వి.)

## తిరుపతి ఆసుపత్రిలో ప్రసూతి వార్డు

మదరాసు, సెప్టెంబరు 14: తిరుపతి ఆసుపత్రిలో కొత్త ప్రసూతివార్డు నిర్మాణానికి యితర సాధారణ వార్డుల మరామత్తుకు రూ. 157650 లను ప్రభుత్వం మంజూరు చేసియున్నది.

## కొత్తపన్నుల సెలక్టు కమిటీ

మద్రాసు, సెప్టెంబరు 14: అభివృద్ధిపన్ను బిల్లు, వాణిజ్యపంటలబిల్లు సెలెక్టుకమిటీలు అక్టోబరు 5, 6 తేదీలలో సమావేశమవుచున్నది. వాటిని గూర్చి విజ్ఞప్తులు పంపేవారు పంపవచ్చునని రెవిన్యూ మంత్రి తెలియచేశారు.

## ఎన్నికలు: రాజకీయఖైదీలు

మద్రాసు, సెప్టెంబరు 14: ఎన్నికలు వస్తున్నాయని రాజకీయ ఖైదీల సందర్భ్ని పవలటమంటూ లేదని మదరాసు ముఖ్యమంత్రి నేడు చెప్పారు. శాంతిభద్రతలకు భంగం లేకుండా పునర్విమర్శ చేయబడిన కొందరిని అప్పుడప్పుడు విడుదస్తూ నేవున్నామన్నారు. ఎంతవరకు సాధ్యమయితే అంతవరకు వదలి పెడతామన్నారు.

## అన్యాక్రమంపన్ను విధింపునకు మాంస విక్రేతల నిరసన

గుడివాడ, సెప్టెంబరు 9: మాంస విక్రయంపై పన్ను వేస్తున్నందుకు నిరసన సూచకంగా స్థానిక చిల్లర మాంస వ్యాపారులు, తమ రాష్ట్ర సంఘ అధ్యక్షుని ఆదేశాను సారము మొన్న హర్తాళ్ జరిపారు. స్వ. వి.

## రైల్వే సీజన్ టిక్కెట్లు దుర్వినియోగానికి శిక్షలు

మంగళగిరి, సెప్టెంబరు 10: తన కుమారుడు పరసురాం పేరట వున్న రైల్వే సీజన్ టిక్కెట్టును దుర్వినియోగించి ప్రయాణం చేసిన నేరానికి పున్నమల్ గెహెలట్ (తండ్రి)కి రు. 100-6-0, కుమారుడికి రు. 100-1-0 జుల్మానాను స్థానిక సబ్ మేజిస్ట్రేటు వి. వి. రాఘవయ్యగారు విధించారు.

# క్రీడారంగం

## ఢిల్లీ టేబుల్ టెన్నిస్ ఛాంపియన్ షిప్

న్యూఢిల్లీ, సెప్టెంబరు 15: ఢిల్లీ స్టేట్ టేబుల్ టెన్నిస్ చాంపియన్ షిప్ వుమన్సు సింగిల్స్ ఫైనల్ లో ఈరోజున శ్రీమతి విజయా రాజగోపాలన్ 21-17, 21-12, 8-21, 21-12. స్కోరుతో నేషనల్ ఛాంపియన్ సయీద్ సుల్తానాను ఓడించారు. తతిమ్మ ఆటల ఫలితాలివి:- మెన్స్ సింగిల్స్ సెమిఫైనల్స్-ఆర్. భండారి ఆర్. బి. ఎల్. సక్సేనాను, తిరువెంగడమ్, ఓమ్‌ప్రకాష్‌లు ఓడించారు. మిక్స్‌డ్ డబుల్స్ సెమి ఫైనల్స్- శ్రీమతి పి. కె. కె. పిళ్ళే, ఓమ్‌ప్రకాష్‌లు శ్రీమతి విజయరాజగోపాలన్, తిరువెంగడంలను; సయీద్ సుల్తానా, ఆర్. భండారీలు శ్రీమతి నిర్మల్ సింగు అర్జన్ సింగులను ఓడించారు. మెన్స్ డబుల్స్ సెమి ఫైనల్స్- కైలాష్ బిహారీ, డి. కె. రామన్‌లు తిరువెంగడం, సి. ఎస్. శాలూలను ఓడించారు.

### జపాన్ హాకీ జట్టు పర్యటన

లక్నో, సెప్టెంబరు 15: ఇండియాలో మూడు వారాలపాటు పర్యటించే జపాన్ హాకీ జట్టు కార్యక్రమాన్ని భారత హాకీసమాఖ్య ఆమోదించినట్లు యిక్కడ తెలుస్తున్నది. జపాన్ హాకీజట్టు ఈ ఏడాది నవంబరు మొదటివారంలో కలకత్తా చేరుకుంటారు. వారు ఇండియాలో మొత్తం 12 నుండి 15 ఆటలవరకు ఆడతారు. ఈ పోటీలు కలకత్తా, పాట్నా, లక్నో, ఢిల్లీ, అంబాలా, భోపాల్, నాగపూరు, హైదరాబాదు, మదరాసు, బొంబాయి నగరాలలో జరుగుతవి. అవికాక తూర్పు పంజాబులో మరిరెండు కేంద్రాలలోను, అలహాబాదు, ఆగ్రాలలోను కూడా ఆటలు జరుగవచ్చు.

### రుద్రా ట్రోఫీ జూనియర్ హాకీ టూర్నమెంటు

మద్రాసు, సెప్టెంబరు 16: జనరల్ రుద్రా ట్రోఫీ జూనియర్ హాకీ టూర్నమెంటు ఫైనల్‌లో నిన్న సాయంకాలం ఎమ్. యు. సి. గ్రౌండులో మౌంట్ యునైటెడ్ క్లబ్ జట్టు ఒక్క గోలుచేసి గ్రాస్‌హాపర్సు జట్టును ఓడించారు. గ్రాస్‌హాపర్సు గోలు చేయలేదు. నిన్నటి ఫైనల్ మేజర్ జనరల్ హెచ్. ఎమ్. చౌహాతే అధ్యక్షత క్రింద జరిగినది.

### ఆంధ్రాజట్టు విజయం

కటక్, సెప్టెంబరు 15. నిన్న యిక్కడ ప్రారంభమైన ఇంటర్ యూనివర్సిటీ ఫుట్‌బాల్ టూర్నమెంటు మొదటి రౌండులో ఆంధ్రా యూనివర్సిటీ జట్టు 5-2 స్కోరుతో కొలంబో జట్టును ఓడించారు.

### ఇంటర్ రైల్వే ఫుట్ బాల్

ఖరగ్‌పూరు, సెప్టెంబరు 15: ఇంటర్ రైల్వే ఫుట్‌బాల్ టూర్నమెంటులో జి. ఐ. పి. రైల్వేజట్టు ఈరోజున 1-0 స్కోరుతో చిత్తరంజన్ లోకోవర్కుస్ జట్టును ఓడించి సెమిఫైనల్‌లో ప్రవేశించారు.

### సిటీ టెన్నిస్‌లీగ్

మద్రాసు, సెప్టెంబరు 16: మద్రాసు టెన్నిస్ లీగులో నిన్న జరిగిన రెండు ఆటలలోను అడయార్ టెన్నిస్ క్లబ్ జట్టు రిపబ్లిక్ క్లబ్ జట్టును ఓడించారు. ఎస్. ఐ. ఎ. ఎ. జట్టు, సెంట్రల్ వై. ఎమ్. సి. ఎ. జట్టు చెరొక రెండు ఆటలు గెలిచారు.

### సిటీ టేబుల్ టెన్నిస్

చెన్నపురి ఆంధ్రమహాసభ నడుపుతున్న బ్రహ్మానందం మెమోరియల్ టేబుల్ టెన్నిస్ టూర్నమెంటులో నిన్న జరిగిన ఆటల ఫలితాలు ఈ క్రింది విధంగా ఉన్నవి: సీనియర్ సింగిల్స్ సెమిఫైనల్స్- జె. వి. సచ్చిదానందరావు, ఎమ్. ఎస్. రామన్‌ను; హరి హరశాస్త్రి, ఐ. అర్జునన్‌ను ఓడించారు. సీనియర్ డబుల్స్ సెమిఫైనల్స్:- ఎస్. ఎమ్. శాయిదు, ఎమ్. ఎస్. రామన్‌లు కె. జి. దాస్, ఎస్. శ్రీనివాసన్‌లను, టి. జి. తిరుమలైస్వామి, సి. కె. పార్థసారథి, ఎస్. సుందరమ్, ఐ. అర్జునన్‌లను ఓడించారు.

### ఇంటర్ రైల్వే ఫుట్‌బాల్

ఖరగ్‌పూర్, సెప్టెంబరు 14: ఇంటర్ రైల్వే ఫుట్‌బాల్ టూర్నమెంటులో నేటి సాయంకాలం తూర్పు ఇండియా రైల్వేజట్టు తూర్పు పంజాబు రైల్వే జట్టును క్వార్టరు ఫైనల్సులో 3-0 గోలులతో ఓడించి సెమీఫైనల్సుకు వచ్చింది. ఈజట్టు అస్సాం రైల్వే బెంగాల్ నాగపూర్ రైల్వే జట్లలో గెలుపొందిన దానితో ఆడుతుంది.

### నేషనల్ ఫుట్‌బాల్ ఛాంపియన్ షిప్స్

న్యూఢిల్లీ, సెప్టెంబరు 14: సంతోష్ ట్రోఫీకొరకు నేషనల్ ఫుట్‌బాల్ ఛాంపియన్‌షిప్ పోటీలు యీనెల 16 నుండి 30 వరకు బొంబాయిలో జరుగనవి. ఈ పోటీలను అఖిల భారత ఫుట్‌బాల్ సంఘం నిర్వహించుచున్నది. ఇందులో అస్సాం, బెంగాల్, బొంబాయి, బీహార్, ఢిల్లీ, హైదరాబాదు, మదరాసు మధ్యప్రదేశ్, మైసూరు, ఒరిస్సా, పంజాబ్, రాజస్థాన్, తిరువాన్కూరు, ఉత్తర ప్రదేశ్ రాష్ట్రాలు పాల్గొంటున్నవి.

# మానవజీవితం: రాజకీయాలు

## మైలాపూరు పరిషత్తుకు ఘోష్ ప్రారంభోత్సవం

మద్రాసు, సెప్టెంబరు 15: "రాజకీయాలను జీవితాన్నుంచి విడదీయడానికి లేదు. మతోద్యమాలుగా దానిని ఒకవిధంగా రాజకీయ ఉద్యమాలేనని ఒక మహాపురుషుడు అన్నాడు. మన సంప్రదాయాలను ఆధునిక పరిస్థితులకు అనుగుణంగా దిద్ది, సామాన్య మానవుడికి తోడ్పడేటట్లుగా రాజకీయాలను సంస్కృతిని సవరించుకోవాలి" అని పి. సి. ఘోష్ గారు ఇవాళ ఉదయం రసికజిహ్వాల్లో మైలాపూరు పరిషత్తును ప్రారంభిస్తూ చెప్పారు. కార్యదర్శి సంస్థ రాజకీయాలకు, కులాలకు అతీతమై, సామాన్య మానవుడికి తోడ్పడే సిద్ధాంతాలను అన్వేషించేదని చెప్పారు. సభాధ్యక్షత వహించిన తె స్కెటె విశ్వనాథంగారు మాట్లాడుతూ గతి నాల్గున్నరేండ్ల స్వాతంత్ర్యాను భవంతోను మనం బాగా గుణపాఠం నేర్చుకున్నామనీ, ఈ సంస్థవారు ఉత్తమ రాజకీయ ప్రమాణాలను నిలబెట్టే మార్గాలనుపరిశోధించవలెననీ చెప్పారు. ఘోష్‌గారు సంస్థను ప్రారంభిస్తూ ప్రతివారు ఆత్మత్యాగంచేసి సంఘశ్రేయస్సుకు తోడ్పడాలనీ, మనకు వచ్చిన స్వరాజ్యంవల్ల పేదలు మరింత నిరుపేదలుగాను భాగ్యవంతులు మరింత భాగ్యవంతులుగాను అవుతున్నారనీ సామాన్యులబాగుకు అంతా తోడ్పడవలెననీ అన్నారు.

ఖాసా సుబ్బారావుగారు మాట్లాడుతూ పరిశుద్ధాత్ములు, సమర్థులను కాంగ్రెసు అభ్యర్థులను పెడతామని నెహ్రూ అన్నమాట బాగానే ఉన్నదనీ, అయితే క్రియలో అందుకు విరుద్ధంగా జరిగేట్లు ఉన్నదన్నారు. నెహ్రూ ఛత్రఛాయల స్వార్థపరులు చేరి వారి ఉదాశయాలను భగ్నం చేస్తున్నారనీ, అది వారు గమనించాలనీ సమర్థులు, విశుద్ధాత్ములూ అయిన ప్రజాసేవకులను, స్వతంత్రమైన పత్రికలను ఆదరించాలనీ చెప్పారు. ఎన్. ఎస్. మణి అభివందనాలతో సభ ముగిసింది.

# బెంగుళూరు వద్ద విమాన ప్రమాదం

## వైమానికునికి తీవ్ర గాయాలు

మద్రాసు, సెప్టెంబరు 15: మదరాసునుంచి ఈవేళ త్రివేండ్రమ్‌కు బయలుదేరిన ఏర్ ఇండియా డకోటా విమానం బెంగుళూరు విమానాశ్రయం వద్ద కూలిపోయినట్లు తెలియవచ్చింది. విమానం బెంగుళూరు విమానాశ్రయంలో దిగి అక్కణ్ణుంచి మళ్ళీ బయలుదేరుతుండగా, ఈ ప్రమాదం సంభవించిందట.

పైలటు, కోపైలటు, రేడియో ఆఫీసరూ, ఏర్ హాస్టెస్ గాయపడ్డారు. విమానంలో వున్న ప్రయాణీకులకు ఎవ్వరికీ దెబ్బలు తగలేదు.

పైలట్ కోపైలట్‌ల స్థితి చాలా ప్రమాదంగా వున్నట్టు తెలుస్తున్నది. హరియజార్ అనే ప్రయాణీకునికి ముక్కుకు దెబ్బ తగిలింది.

## అవినీతి పరులైన ప్రభుత్వోద్యోగులకు శిక్షలు

మదరాసు, సెప్టెంబరు 14: 1951 మార్చిలో ప్రభుత్వోద్యోగులలో అవినీతిపరులైన 302 మంది మీద కేసులు ఆరోపింపబడ్డది. విచారణ జరిగినమీదట 25 మంది నిర్దోషులుగా వదిలి వేయబడ్డారు. 15 మంది విషయంలో అపరాధములు ఋజువై శిక్షలు విధించబడినది. సెలాఖరున 262 మంది కేసుల విచారణ పూర్తికాలేదు.

## తూర్పు గోదావరిలో చర్మ వ్యాధి రోగులకు చికిత్స

మదరాసు, సెప్టెంబరు 14: తూర్పు గోదావరిలో జగ్గంపేట పరిసర గ్రామాలలో "యాస్" అను నొక విషమైన చర్మవ్యాధిగ్రస్తులకు ఇంజెక్షన్లు మూలమునను యితర విధములలోను వారాని కొకసారి వైద్యసహాయం చేయుటకు ఒక మెడికల్ ఉద్యోగిని నియమించవలెనని మెడికల్ సర్వీసుల డైరెక్టరు చేసిన సూచనను ప్రభుత్వం అంగీకరించినది.

## కొత్త సివిల్ సప్లయిస్ డైరెక్టరు

మదరాసు, సెప్టెంబరు 15: సివిల్ సప్లయిస్ డైరెక్టరుగా వుంటున్న శ్రీయుం. ఎ. కుట్రాల లింగంపిళ్ళ గారు కాఫీ మార్కెటింగ్ ఉద్యోగిగా వెళ్తున్నారు. వారి స్థానం శ్రీ వి. వి. సుబ్రహ్మణ్యం ఐ. సి. యస్. గారికి సివిల్ సప్లయిస్ డైరెక్టరు పదవి ఛార్జి అప్పచెప్పారు.

## బంగారం అపహరణ

మద్రాసు, సెప్టెంబరు 15: కస్టమ్స్ ఆఫీసర్లు, ఈ వేళ తాంబ్రం స్టేషన్లో బంగారం దొంగిలించుకొని వస్తున్న ఒక యువకుని అరెస్టుచేశారు. ఇతను 6 వేల రూ.ల విలువగల బంగారపు కడ్డీని ఫ్లోరీదుపాకెట్టులో సర్దుకొని ఉంచగా కనిపెట్టి, వీరు పట్టుకొన్నారు.

## తిరుపతి గొందులకు ఉత్సవం

తిరుపతి గొందులకు తోరణం మొదలగు ఉత్సవం రాయపురం ముఖ్య వీధుల్లో జరుగుతుంది.

# పత్రికా ముద్రణాచట్టం అధిక్షేపణ

## పత్రికా రచయితల ఫెడరేషను విజ్ఞప్తి

ఢిల్లీ, సెప్టెంబరు 14: ప్రస్తుతము ఇండియా పార్లమెంటులో చర్చింపబడుచున్న పత్రికాముద్రణ చట్టమును యిప్పుడు శాసింప బూనుకోవద్దని కోరుతూ అఖిల భారత పత్రికారచయితల సమితివారు ఒక విజ్ఞప్తిని హోం శాఖామంత్రి సి. రాజగోపాలాచారి గారికి సమర్పించిరి. ఇప్పటి పత్రికా శాసనమును రద్దుచేయవలసిన దనియు, ఎన్నికల అనంతరము ఏర్పడబోయే కొత్త పార్లమెంటు యీ చట్టమును గూర్చి యోచించునిమిత్తమయి నిలిపియుంచవలెననియు, యీ విజ్ఞప్తిలో కోరబడెను. పత్రికా వ్యవహార విషయక కమిటీ నొకదానిని త్వరలో నియమించవలసినదిగా కోరబడెను.

ఈపత్రికాముద్రణచట్టమును గూర్చిన వ్యవహారచర్చను యిప్పుడు నిలిపియుంచనిపక్షములో ఆ చట్టమును పరిశీలించుటకై నియమింపబడే సెలెక్టు కమిటీకి యీ విజ్ఞప్తిని నివేదించవలెనని కోరబడెను. ప్రస్తుతపు పత్రికాముద్రణ చట్టమును అధిక్షేపిస్తూ ఆ విజ్ఞప్తిలో యీ క్రింది ఆక్షేపణలు చెప్పబడెను.

రాజ్యాంగచట్టములోని ప్రాతిపదిక హక్కులను యిటీవల సవరణ చేసినప్పుడు వాక్స్వతంత్ర్యమును గూర్చిన 19 వ నిబంధన సవరణ చేయబడెను. ఈ సవరణ చేయబడినప్పుడు వాక్స్వతంత్ర్యమును అరికట్టునటువంటి చట్టములు శాసింపబడవనీ కొన్ని వాగ్దానములు పార్లమెంటులో చేయబడెను. ఆనాటి వాగ్దానములకు సంబద్ధంగా యీ చట్టం లేదు. ఇటీవల చేయబడిన రాజ్యాంగ చట్ట సవరణలు చెల్లనేరవని సవాలు చేస్తూ సుప్రీంకోర్టులో దావా దాఖలు చేయబడెను. ఈ విషయంలో సుప్రీంకోర్టు ఏ విధంగా తీర్పు చెప్పునో కొంతకాలం ఆగిచూడవలెను. యీలోగా నే తొందరపడి యీ పత్రికా ముద్రణ చట్టమును శాసింప యత్నించుట తగదు. ఇప్పుడు తలపెట్టిన యీ చట్టమువల్ల న్యాయమైన వ్యవహార విషయ విమర్శలు కూడా చేయ వీలు లేకుండా పత్రికా స్వాతంత్ర్యమును అరికట్టడమగును. కొత్త ఎన్నికలు జరుగనున్న సమయంలో అధికారం సమాప్తమగుచున్న పాత పార్లమెంటు యీ చట్టమును శాసింపబూనుకొనుట ప్రజాస్వామ్య ప్రభుత్వ సంప్రదాయ విరుద్ధం. ఈ చట్ట నిబంధనల విషయములో ప్రజాభిప్రాయమును పరిశీలించకుండా తగిన చర్చ లేకుండా, ఈ చట్టమువల్ల బాధింపబడే పత్రికా నిర్వహణ వర్గముల అభిప్రాయములను గ్రహించకుండా తొందరపడి శాసించడం తగదు. దానిని ప్రస్తుతం నిలిపియుంచి వాయిదా వేయడంవల్ల కలిగే నష్టమేమీ లేదు. సాధారణ పౌరుల కుండే స్వాతంత్ర్యం పత్రికలకుకూడా పూర్తిగా ఉండాలి. ఇటువంటిపత్రికా శాసనం నాగరిక రాజ్యాలలో ఎక్కడా లేదు. కోర్టిపెట్టుబడితో నిర్వహింపబడే పత్రికలకు ఈ చట్టము చాలా ప్రతిబంధకములను కల్పిస్తోంది.

పత్రికా విచారణ కమిటీ నొకదానిని నియమించవలసిన అగత్యం ఉంది. పత్రికా నిర్వహణం ఏ రీతిగా జరుగుచున్నదో పరిశీలించడానికి అట్టి కమిటీని ఏర్పాటు చేస్తానని పండిట్ నెహ్రూగారు వాగ్దానం చేశారు. నూతన కాలావసరముల కనుగుణంగా పత్రికా నిర్వహణమును కట్టుదిట్టం చేయవలసియున్నది. ప్రస్తుత చట్టంలో 10 మొదలు 14 సెక్షనులను సెలెక్టు కమిటీ బాగాపరిశీలించవలసియున్నది. ప్రభుత్వమువారు ఈ చట్టము విసర్జించి జరిపెడిచర్యలనుగూర్చి పరిశీలించు నిమిత్తమై శాసనసభలోని సభ్యులు కొందరుగల కమిటీ ఒకటి నియమింపబడవలెను. ఏ పత్రిక కైనను ఈ చట్టం క్రిందగాక, మరొక చట్టంక్రిందకూడా ఒకే నేరమునకు గాని శిక్ష విధింపకుండా కట్టుదిట్టం చేయాలి.

## పత్రికల బిల్లుకు హైదరాబాదు పత్రికా రచయితల ప్రతిఘటన

హైదరాబాదు, సెప్టెంబరు 12: ప్రస్తుతం పార్లమెంటువారు చర్చిస్తున్న పత్రికల బిల్లును ప్రతిఘటిస్తూ దానిని ఉపసంహరించుకోమ్మని అఖిల హైదరాబాదు పత్రికా రచయితల సంఘం తాలూకు కార్యవర్గంవారు నేడు ఇండియా హోంమంత్రికి ఒక తంతి పంపారు. దాని నకలొకటి అ. భా. పత్రికా సంపాదకుల సంఘాధ్యక్షులైన దేవదాసు గాంధీగారికి కూడా పంపించారు.

## ఉద్యోగ వార్తలు

మదరాసు, సెప్టెంబరు 15: కే. వెంకటవరదారెడ్డిగారు తుంగభద్ర ప్రాజెక్టు స్పెషలు డ్యూటీ డిప్యూటీ కలెక్టరు బళ్లారి జనరలు డ్యూటీకి నియమింపబడ్డారు.

శ్రీ డి. కృష్ణాగారు బళ్లారి జనరలు డ్యూటీనుండి బళ్ళారి (హాస్పిటల్) జనరలు డ్యూటీకి మార్చబడ్డారు.

శ్రీ కె. కృష్ణస్వామిగారు బళ్ళారి జనరలు డ్యూటీ డిప్యూటీ కలెక్టరు తుంగభద్రప్రాజెక్టు స్పెషలు డ్యూటీకి మార్చబడ్డారు.

శ్రీ ఆర్. రామమూర్తిగారు విశాఖపట్నం జనరలు డ్యూటీ డిప్యూటీ కలెక్టరు శ్రీ కె. శ్రీనివాసన్ ఐ. ఎ. యస్. గారికి ఛార్జి అప్పచెప్పి, విశాఖపట్నం ఆఫీసులో స్పెషల్ ఏజెంట్ నేవలుగా నియమింపబడ్డారు.

# పార్లమెంటుకు ఆంధ్ర కాంగ్రెస్ అభ్యర్థులు

విజయవాడ, సెప్టెంబరు 13: భారతి యూనియన్ పార్లమెంటు ప్రజాప్రతినిధి సభకు ఆంధ్రప్రదేశంనుంచి, యీదిగువవారు కాంగ్రెసు అభ్యర్థులుగా పోటీ చేయదలచి, ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ సంఘానికి దరఖాస్తులు పంపుకొన్నారు.

పాతపట్నం: శ్రీయుతులు వై. వి. రామమూర్తి, పొట్నూరి స్వామిబాబు, ఎస్. వి. వి. బి. రామలింగం. శ్రీకాకుళం: శ్రీయుతులు పి. ఎల్. ఎన్. రాజు, జి. వి. రామమూర్తి. పార్వతీపురం: శ్రీయుతులు గోన సీతారామస్వామి. యస్. సీతారామపాత్రుడు. విజయనగరం: శ్రీ ఎస్. వి. చలమాజీ. విశాఖపట్టణం: శ్రీయుతులు వి. జె. గుప్తా, పి. వీరభద్రస్వామి, వి. వి. గిరి, కె. సుబ్బారావు, శ్రీమతి జి. దుర్గాబాయి. కాకినాడ: శ్రీ ఎం. తిరుమలరావు. రాజమండ్రి: శ్రీయుతులు కళా వెంకట్రావు, పంపన లక్ష్మణస్వామి. ఏలూరు: శ్రీయుతులు పి. కోదండరామయ్య, యస్. బ్రహ్మయ్య, కె. జె. గోపాలరావు, యం. సత్యనారాయణరావు, అద్దేపల్లి సత్యనారాయణమూర్తి. ఏలూరు: (షెడ్యూల్డు) టి. వి. రాఘవులు, శ్రీమతి కె. సరోజనీదేవి. మచిలీపట్నం: శ్రీయుతులు వి. దామోదరరావు, కె. పూర్ణమల్లిఖార్జునుడు, వి. సుబ్బారావు. గుడివాడ: శ్రీయుతులు పోటూరి సత్యనారాయణ, దుగ్గిరాల బలరామకృష్ణయ్య. విజయవాడ: శ్రీయుతులు అప్పికట్ల జోసెఫ్, జంధ్యాల దక్షిణామూర్తి, తులాబందుల నాగేశ్వరరావు, శ్రీమతి రాజ్యం సిన్హా. తెనాలి: శ్రీ కొత్తా రఘురామయ్య, గుంటూరు: షేక్ గాలీబు, గాలి రత్నం. నర్సరావుపేట: శ్రీయుతులు కె. వెంగలరెడ్డి, యన్. ఆంజనేయులురెడ్డి. ఒంగోలు: (షెడ్యూల్డు) శ్రీ వి. సి. కేశవరావు. నెల్లూరు: శ్రీ బెజ్జెలకంటి రాఘవయ్య, నంద్యాల: శ్రీయుతులు వంశీర్ బేగ్, పి. కోటయ్యచౌదరి, జి. వెంకటరెడ్డి. కర్నూలు: శ్రీ ఎస్. మలాధిరెడ్డి. బళ్ళారి: టి. జి. తిమ్మయ్యశెట్టి. అనంతపురం: శ్రీ కె. వి. రహీం తుల్లా. పెనుకొండ: కల్లూరు సుబ్బారావు. కడప: శ్రీయుతులు సి. యల్. నరసింహారెడ్డి, పి. బసిరెడ్డి, వి. కొండారెడ్డి. చిత్తూరు: (షెడ్యూల్డు) ఎం. వి. గంగాధరశివా. తిరుపతి: శ్రీయుతులు యం. అనంతశయనం అయ్యంగారు, టి. ఎ. టి. తాతాచారి.

### స్టేట్స్ కౌన్సిల్ అభ్యర్థులు

శ్రీయుతులు జి. వి. కృపానిధి, కె. వరదాచారి, షేక్ గాలీబుగారలు, స్టేట్ కౌన్సిల్ స్థానములకు కాంగ్రెస్ అభ్యర్థులుగానిలువదలచిదరఖాస్తులు పంపారు.

### ఆంధ్రరాష్ట్ర రైతుసంఘ సమావేశం వాయిదా

బెజవాడ, సెప్టెంబరు 15: ఆంధ్ర రాష్ట్ర రైతు సంఘాధ్యక్షుడు ముక్కామల నాగభూషణంగారు యిలా ప్రకటిస్తున్నారు:

"అఖిల భారత కిసాన్ సభాధ్యక్షులు శ్రీ ఎ. కె. గోపాలన్ గారు హాజరవడానికి వీలుగా, ఈనెల 18 వ తేదీన జరగవలసిన ఆంధ్రరాష్ట్ర రైతు సంఘ సమావేశం అక్టోబరు 8 వ తేదీకి వాయిదా వేయబడింది. కాన యీ మార్పును సభ్యులందరూ గుర్తించి, అక్టోబరు 8 వ తేదీ మధ్యాహ్నం 1 గం||కు బెజవాడ రామమోహన లైబ్రరీలో జరుగు సమావేశానికి హాజరు కావలసిందిగా ప్రార్థన."

### ఓ. పుల్లారెడ్డిగారి పుత్రిక వివాహం

తిరుపతి, సెప్టెంబరు 12: మద్రాసు ప్రభుత్వ హోంశాఖ కార్యదర్శికి ఓ. పుల్లారెడ్డిగారు తమ పుత్రిక చి|| సౌ|| శ్రీరంజనిని చి. వి. ద్వారకనాథ్ రెడ్డికి యిచ్చి, నేడు తిరుచానూరులో అతి వైభవంగా వివాహం జరిపారు. ముఖ్య మంత్రి పి. ఎస్. కుమారస్వామి రాజా, మంత్రులు గోపాలరెడ్డి, సీతారాంరెడ్డి, మాధవమీనన్, పెరుమాళ్ స్వామిరెడ్డి, కౌన్సిల్ అధ్యక్షులు ఆర్. బి. రామకృష్ణరాజు, కె. వెంకటస్వామినాయుడు, శ్రీమతి అమ్మన్న రాజా, కేంద్ర ప్రభుత్వ మాజీ ఆర్థికమంత్రి ఆర్. కె. షణ్ముఖంచెట్టి, కె. కోటిరెడ్డి పోలీసు యిన్‌స్పెక్టరు జనరల్ ఎస్. సంజీవరెడ్డి గార్లు తదితర అధికార అనధికార ప్రముఖులు వివాహ మహోత్సవానికి వచ్చారు.

# సినిమానటి బేగం ప్యారాకు చెరసాలప్రాప్తి

## అజాగ్రత్తగా మోటారు నడిపించిన ఫలితం

బొంబాయి, సెప్టెంబరు 14: అజాగ్రత్తగా మోటారు నడిపించి, ఒక ప్రమాదానికి హేతుభూత మైనందుకు రాజధాని మేజస్ట్రేటు బేగం ప్యారా అనే సుప్రసిద్ధ సినిమానటికి (వయస్సు 26 ఏండ్లు) 6 వారాల జెయిలు శిక్ష విధించారు. జెయిలువాసంతోపాటు 25 రూ. జుల్మానాకూడా చెల్లించాలన్నారు. లైసెన్సు లేకుండా మోటారు నడిపిన నేరమూ, త్రాగిన మత్తులో ఉన్న నేరముకూడా ఆమెపై మోపబడినవి.

### అప్పికట్ల జోసెఫ్

న్యూఢిల్లీ, సెప్టెంబరు 14: అ. భా. రేడియో విజయవాడ స్టేషను ప్రోగ్రాం సలహా సంఘ సభ్యులుగా శ్రీ అప్పికట్ల జోసెఫ్ ఎమ్. పి. నియమింపబడినట్లు నేడు అధికారికంగా ప్రకటనజరిగింది.

# రాజపుత్రస్థాన ఎడారిలో అరణ్యాభివృద్ధి

## 20 ఏళ్ల పథకం: రూ 5½ కోట్ల ఖర్చు

[‘ఆంధ్రపత్రిక’ విలేఖరి]

ఢిల్లీ, సెప్టెంబరు 12: నేడు యిండియా పార్లమెంటులో ఇండియా ప్రభుత్వ ఆహార శాఖమంత్రి కే. యం. మున్షీగారు రాజపుటానా ఎడారినొక అరణ్య ప్రాంతంగా మార్చుటకై ఇండియా ప్రభుత్వముక స్కీమును పరిశీలించుచున్నదని వెల్లడించారు. రాజపుటానా ఎడారి 80 వేల చదరపుమైళ్ళ ప్రదేశం. ఈ ఎడారిప్రాంతం యావత్తూ ఒకప్పుడు అరేబియా సముద్రంలో చేరి యుండేదనియు, కొంతకాలానికి అరేబియా సముద్రం వెనుకకు పోవుటవల్ల ఈ ప్రదేశంఅంతా ఎడారిగా ఏర్పడినదనియు, శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. అందుకు తార్కాణంగా యిక్కడ మధ్య మధ్య ఉప్పునీళ్ళ సరస్సులు ఉన్నాయి. నేల అడుగున త్రవ్వితే ఉప్పులో కూడిన చవిటిమన్ను పొరకన్పిస్తుంది. ఈప్రాంతం ఒకప్పుడు చవిటి ఊబినేలయని హిందూ పురాణములలో వర్ణింపబడి యున్నది. కొబట్టి అరేబియా సముద్రం ఒకప్పుడు రాజపుటానాలోని ఆరావళి పర్వతము వరకు వ్యాపించి యుండేదని ఋజువగుచున్నది. ఈ విధంగా ఏర్పడిన యీ ఎడారి భారతదేశ వాయవ్య ప్రాంతానికి అంతటికీ పెద్ద అనర్థకంగా ఉంది. ఎండాకాలంలో ఈ ప్రాంతములో ఇసుక దుమారము బ్రహ్మాండంగా బయలుదేరి, దేశమధ్యం లోనికి యీ యిసుకరేణువు కొట్టుకొనిపోయి అక్కడ మరికొంత ఎడారి ఏర్పడుతుంది.

ఈ ఎడారి దేశమంతటను విస్తరించకుండా అరికట్టుటకై భారతప్రభుత్వముకస్కీమును గురించి ఆలోచించుచున్నది. ఈ స్కీమును కొనసాగించుటకు 20 ఏండ్లుపట్టును; రూ 5½ కోట్లు ఖర్చుఅగును. కచ్చివద్ద ఇసుకపర్వతములను మెట్టులవలె నిర్మాణం చేయాలి. తద్వారా గాలిదుమార మండలములను కల్పించవలెను. అదిన్నిగాక, అరావళీ పర్వతముల చరియలందు, అబూ పర్వతశిఖర ప్రాంతమునుండి అజ్మీరు వరకు అడవిని విరివిగా పెంచవలెను. [illegible]

ఇదంతా 20 ఏండ్లపని. దీనికి రూ 5½ కోట్లు ఖర్చుఅగును. మొదటి సంవత్సరం రూ 30 లక్షలు ఖర్చుఅగును. అటు పిమ్మట సంవత్సరానికి రూ 28 లక్షలు ఖర్చు అవుతుంది. ఈ స్కీము వల్ల ప్రత్యక్ష ఫలితం ఉండదు. గాని, దీని [illegible]

# పశ్చిమ బెంగాలు కాంగ్రెసు ఎన్నికలు

## హైకోర్టు ఇంజంక్షన్

కలకత్తా, సెప్టెంబరు 14: ప్రస్తుత పశ్చిమ బెంగాలు కాంగ్రెసు కమిటీ సభ్యుల ఎన్నిక సక్రమంగా జరగలేదు గనుక, రాబోయే జనరల్ ఎన్నికలకు అభ్యర్థులను నామినేట్ చేసే వ్యవహారం కాంగ్రెసు కమిటీ ప్రస్తుతానికి ఎత్తుకోకుండా, తాత్కాలిక ఇంజక్షన్ జారీచేయవలసిందని, విరళ్ చంద్ మల్లిక్‌గారు ఒక పిటిషన్ దాఖలు చేయగా, హైకోర్టువారు అప్రకారం ఈవేళ తాత్కాలిక ఇంజక్షన్ ఉత్తర్వు జారీ చేశారు.

## ఇండియా-అమెరికా విమాన సర్వీసు.

[ఆంధ్రపత్రిక విలేఖరి]

ఢిల్లీ, సెప్టెంబరు 13: భారతదేశానికి అమెరికాకు మధ్య ఉండే విమాన రహదారిని గురించిన ఒడంబడికను పరిశీలించు నిమిత్తమై ఒక సభను అమెరికాలో వాషింగటను నగరమందు జరుపవలెనని ఇండియా ప్రభుత్వం సూచించినది. అందుకు అమెరికా ప్రభుత్వం అంగీకరించునని తెలియుచున్నది. అమలులో ఉన్న యీ విమానరహదారీ ఒడంబడిక తృప్తికరంగా లేదు. అమెరికావారికి భూప్రదక్షిణ విమాన సర్వీసులు రెండు ఉన్నాయి. ఈ సర్వీసు విమానాలు మధ్య కొన్ని దేశాలలో ఆగి ఏదు కొందునుంచి ఏదు కొనుకైనా సరే ప్రయాణీకులను తీసికొని పోతున్నాయి. ఇండియాలో కూడా విదేశాలకు నడిచేటటువంటి విమాన సర్వీసులు ఉన్నాయి. ఈ సర్వీసులకు అమెరికావారి భూప్రదక్షిణసర్వీసులు పోటీగా ఉంటున్నాయి. ఇటీవల డచ్చి విమాన సర్వీసున్నూ బ్రిటిష్ విమాన సర్వీసున్నూ భారతీయ విమాన సర్వీసులతో పోటీకి రాకుండా బ్రిటనుతోను హాలెండుతోను ఒడంబడికలు ప్రాసికొబడెను.

# రేడియో

## సెప్టెంబరు 18 మంగళవారం

### విజయవాడ

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 మద్రాసు (బి) వరె 7-30 మద్రాసు (ఎ) వరె 8 ఆంగ్లమున వా॥

మ॥ 12 30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు హిందీపాఠము మన పక్షిజాలము పావురము ప్రసంగం జి. వాణీశ్యాంబ 1 మద్రాసు (బి) వరె 1-30 మద్రాసు (ఎ) వరె 1-40 హిందీలో వా॥ 1-50 తెలుగున వా॥ 2 మద్రాసు (సి) వరె 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు మాత్స్యకోకము సుభద్ర ప్రసంగం వి. సుబ్బారాయశాస్త్రి సాహిత్యసారము మతము ప్రసంగం ఆకొండి వర్మబ్రహ్మశాస్త్రి 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు అపూర్వగ్రంథములు పాఠము ప్రసంగం ఎస్. వెంకటలక్ష్మమ్మ బృందగానము గాంధీనగర్ ప్రాథమిక పాఠశాల నౌక చరిత్ర జలాంతర్గాములు ప్రసంగం ఎం. వి. శాస్త్రి.

సా॥ 5-30 గుమ్మలూరి వెంకటరమణమ్మ 5-50 ముచ్చిపల్లి రామమూర్తి వయొలిన్ 6.10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 గీత మంజరి (రి) ఎ కమలాదేవి ఎన్. ఎస్ గిరి బి. ఎన్ పద్మావతి, కె. ప్రసాదరావు 6-30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయగోష్ఠి కాలముకాలముగాదు భక్తిగీతము విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం గోష్ఠిగానము 7-30 సంగీత శిక్ష 7-45 చిత్రవాణి (రి) ఆండాళ్, భక్తసూరదాస్, బాలమ్ బాబుల్‌భాయి 8 గుమ్మలూరి వెంకటరమణమ్మ 8-30 ముచ్చిపల్లి రామమూర్తి వయొలిన్ 9 ఆంగ్లమున వా॥ 9.15 ఆంగ్లమున ప్రసంగం 9-30 ముగింపు

### మద్రాసు (ఎ)

ఉ॥ 7 స్వాగతము 7-30 వి. అనంతరామన్ 8 ఆంగ్లమున వా॥.

మ॥ 12 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు తమిళమున 1 మహిళామండలి నువ్వు నేనే గేయము రచన లతీఫ్ దావిదాజ విషాదాంత ప్రణయగాథలు రోమియో జూలియట్ ప్రసంగం అచ్యుతుని గిరిజ ఉయ్యాలలూగ వాద్యసమ్మేళనము ఉద్యానము మారగాయలతోట ప్రసంగం కె. కామేశ్వరి 1-30 గీతమంజరి (రి) 1-40 హిందీలో వా॥ 1-50 ఫిలిం సంగీతం (రి) 2-10 (రి) వరె 2.15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు తమిళమున 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు తమిళమున 4-30 పాశ్చాత్య సంగీతం (రి).

సా॥ 5-30 ఎన్. కళ్యాణ వయొలిన్ 6 ఆంగ్లమున వా॥ 6.10 స్థానిక ప్రకటనలు వాతావరణము 6-20 పాలఘాట్ కె. ఆర్. ఎస్. మణి అయ్యర్ 7 గీతమంజరి (రి) 7-30 తమిళమున పుస్తక సమీక్ష 7-45 మదుర ఎస్. సోమసుందరం తిరుచినుండి 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీపాఠము తెలుగున 9.30 (బి) వరె 10 వాద్యసంగీతం (రి) రాజమాణిక్యంపిళ్ళై వయొలిన్ ఆర్. ఎస్. శంపి వీణ టి. ఎస్. స్వామినాథపిళ్ళై. వేణు టి. సుబ్రహ్మణ్యం నాదస్వరం 10-30 ముగింపు.

### మద్రాసు (బి)

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 భజనగానము (రి) ఆర్. తంగమ్మాళ్. మాణిక్కం 7-30 (ఎ) వరె.

మ॥ 12 కాప్నడు. కార్యక్రమం 12 30 మాధ్యమిక పాఠశాలా విద్యార్థులకు హిందీపాఠము మన పక్షిజాలము పావురము ప్రసంగం జి. వాణీశ్యాంబ 1 గీతమాలిక (రి) 1-30 ఆంగ్లమున వా॥ 1-40 ఫిలిం సంగీతం (రి) 1-50 తెలుగున వా॥ 2 సారంగి వలయవిద్వాంసుడు 2-15 ఉన్నత పాఠశాలా విద్యార్థులకు మాత్స్యకోకము సుభద్ర ప్రసంగం వి. సుబ్బారాయశాస్త్రి సాహిత్యసారము మతము ప్రసంగం ఆకొండి వర్మబ్రహ్మశాస్త్రి 4 ప్రాథమిక పాఠశాలా విద్యార్థులకు అపూర్వగ్రంథములు పాఠము ప్రసంగం ఎస్. వెంకటలక్ష్మమ్మ బృందగానము గాంధీనగర్ ప్రాథమిక పాఠశాల నౌక చరిత్ర జలాంతర్గాములు ప్రసంగం ఎం. వి. శాస్త్రి.

సా॥ 5-30 (ఎ) వరె 6-20 సాయం సంగీతం (రి) 6-30 గ్రామస్థుల కార్యక్రమం వ్యవసాయగోష్ఠి కాలము కాలముగాదు భక్తిగీతం విశేషాలు ప్రకటనలు ధరలు వాతావరణము 7 తెలుగున వా॥ 7-15 గ్రామస్థుల కార్యక్రమం గోష్ఠిగానము 7-30 పుస్తక సమీక్ష తిప్పూరపరుల కోదండరామయ్య 7-45 (ఎ) వరె 9-15 తమిళమున నాటిక 9-30 టి ఎ. వాసుదేవన్ 10 (ఎ) వరె 10.30 ముగింపు.

### హైదరాబాద్

ఉ॥ 7 తెలుగున వా॥ 7-15 తెలుగు హిందీ లలో నేటి కార్యక్రమ సమీక్ష 7-20 షంకరగుంట సైదుర్ సాహెబ్ నాదస్వరం 7-50 గేయమాల (రి) 8 ఆంగ్లమున వా॥ 8.15 హిందీపాఠము తెలుగున 8-30 శారద్ వరంకర్ ఖ్యాల్‌ఠోరి 8.45 కాంతారంజన్ భజన్.

మ॥ 12-30 హిందీ (రి) 1 జావళీలు (రి) 1-10 గీతమాల (రి) 1-30 ఆంగ్లమున వా॥ 1.40 వివిధభారతి (రి) 1-50 తెలుగున వా॥.

సా॥ 5-30 మహారాష్ట్రమున కార్యక్రమం 6 ఆంగ్లమున వా॥ 6-10 స్థానిక ప్రకటనలు 6-20 రహిముద్దీన్ దాగర్ (రి) 6-35 కాంతారంజన్ భజన్ 6-45 గ్రామసీమ తరంగాలు 7 తెలుగున వా॥ 7-15 గ్రామసీమ వర్తపాటలు విశేషాలు మార్కెట్ ధరలు వాతావరణము 8-15 చలికాలానికి ఆరోగ్య సూచనలు ప్రసంగం 8-30 అబ్దుల్‌గఫార్ ఖుద్ 8-45 శారద్ వరంకర్ ఖ్యాల్ ఏమన్ 9 ఆంగ్లమున వా॥ 9-15 హిందీలో వా॥ 9-30 షంకరగుంట సైదుర్‌సాహెబ్ నాదస్వరం 10-15 ముగింపు.





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St, Madras.